*Issued*— 12-10-1956




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## FRIDAY, 5th AUGUST, 1955

## VOLUME VII—No 3

*CONTENTS*




PRINTED BY SREE PANDURANGA PRESS ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL

1956

PRICE 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Friday, 5th August, 1955**



The House met in the Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr Speaker [The Hon Sri R L Narasimham Dora] in the Chair

## I QUESTIONS AND ANSWERS

### SHORT NOTICE STARRED QUESTIONS

*Appointing of a Special Boundary Commission by the Government of India*

356-A

* 1602 A Q Sri VAVILALA GOPALAKRISHNAYYA — Will the Hon the Chief Minister be pleased to state whether the Government is aware of the consideration of appointing a Special Boundary Commission by the Government of India to go into the border disputes between the Andhra and Madras States especially in Chittoor District ?

The Hon Sri B GOPALA REDDI — The Government have seen the news item in the press

Sri VAVILALA GOPALAKRISHNAYYA —'ఈ కమీషన్ వేసే మాట నిజమా' అని నా Question

The Hon Sri B GOPALA REDDI — ఇక్కడ మనం సరియైన మార్గములో రాజీ పడలేకపోతే వాళ్లు appoint చేస్తారు అది ఉంటుందని చెప్పినారేగాని ఇటీవల దాన్ని గురించి ప్రభుత్వంవారు ఏమీ వినలేదు

Sri VAVILALA GOPALAKRISHNAYYA — 'A direct approach has been made suggesting that the border question may be taken immediately on the bassis of the population of the disputed villages as reported in the 1951 census' అని Madras గవర్నరుగారి speech లో ఉంది ఐతే 1931కి 1951 కి చాలా తేడా ఉంది అందువల్ల ఆంధ్రులకు అన్యాయమౌతుందనే సంగతి దయచేసి గుర్తించి 1931 వ సంవత్సరము basis గా తీసుకోవాలనేది మీరు సూచిస్తారా ?

The Hon Sri B GOPALA REDDI —ఈ విషయమై మనప్రభుత్వముకూడా కొంత పరిశీలనచేస్తున్నారు ఏ basis మీద ఈ విషయములో మనం negotiations జరిపించవలెననే విషయం ఇంకా ఆలోచనలో యున్నది అందువల్ల ప్రస్తుతమేమీ చెప్పడానికి వీలులేదు.

Sri A KALESWARA RAO — ఈ గవర్నమెంటువారూ, Madras గవర్నమెంటువారూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం చిత్తూరు, సేలం, ఉత్తరార్కాటు, చెంగల్పట్టు జిల్లాలలో గుండేటటువంటి ఆంధ్ర తమిళ సరిహద్దులనుగురించి పరిష్కారం చెయ్యడానికి ప్రయత్నమా?

The Hon Sri B GOPALA REDDI — ప్రయత్నం కేవలం ఒక తాలూకా, ఒక జిల్లావిషయం కాదు అన్ని తాలూకాలలో అన్ని జిల్లాలలో ఉన్నటువంటి విషయం పరిశీలన చెయ్యడానికే మనవైపు ఇద్దరు ఉద్యోగస్థులను నియమించినాము వాళ్లు పరిశీలన చేస్తున్నారు అదైనతరువాత ఆ ప్రభుత్వంతో సంప్రతింపులు చేయవలసి యుంటుంది

Sri R B RAMAKRISHNA RAJU — ఇప్పటికే తీర్మానమైపోయిందనీ, తిరుత్తని వాళ్ళకు ఇచ్చేశామనీ అటు పోయిందనీ, ఇటు పోయిందనీ, paper లలో వస్తోంది దానికేమైనా ఆధారం ఉందా?

The Hon Sri B GOPALA REDDI — లేదని చెప్పడానికి సంతోషిస్తున్నాను

Sri A KALESWARA RAO — మధ్యప్రదేశ్ లో ఉన్నటువంటి Indravati కి దక్షిణంగాయున్న దక్షిణ బస్తర్ మనకు రావలెననిన్ని, అట్లాగే చాందా District లో యున్నటువంటి శిరివంచ తాలూకా తహశీలున్నూ, ఇంకా ఖండా, గడ్చిరోల తాలూకాలలోని కొన్ని గ్రామాలు రావలెనని ఆంధ్ర ప్రభుత్వం తమ యొక్క memorandum లో కోరియున్నది అట్లాగే Provincial Congress Committee, విశాలాంధ్ర మహాసభ కోరియున్నవి దాని విషయంకూడా మధ్యప్రదేశ్ ప్రభుత్వంతో ఏమైనా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి అదికూడా రాజీమార్గాన పరిష్కరించుకోటానికి ఈ ప్రభుత్వంవారు ఏమైనా చేస్తారా?

The Hon Sri B GOPALA REDDI - ముందు ప్రథమంగా మద్రాసు ప్రభుత్వంతో, మనం ఇదివరకు వారితో కలిసియున్నాం కనుక, రాజీపడితే తరువాత ఇతర ప్రభుత్వాలతో, మధ్యప్రదేశ్ గాని, ఒరిస్సాగాని, వారితో రాజీకి ప్రయత్నం చేయవచ్చు ముందు మదరాసు ప్రభుత్వంవారితో సంప్రతింపులు జయప్రదం కావలసియున్నది

Sri P GOPALU REDDI — అధ్యక్షా! Special officer నియామకం జరిగింది కదా, వారికి సలహా ఇవ్వటానికి శాసనసభలోనుంచి, ఆ boundary కి సంబంధించినటువంటి సభ్యులలో కొంతమందిని సలహాసంఘంగా ఏర్పాటు చేస్తారా ప్రభుత్వంవారు?

The Hon Sri B GOPALA REDDI —Special Officer ను ఎవరినీ appoint చెయ్యలేదు అది మన Secretariat లోనివాళ్ళు examine చేస్తున్నారు అంతేకాని special officers కాదు ఇద్దరు సెక్రటరీలను ఆ విషయములో నియమించినాము. వారు పరిశీలనచేసుకుంటున్నారు. వారికిప్పుడు సలహా సంఘం ఏమీ లేదు. అవసర

హైకోర్టుకు ఎవరైనా వారిని meet కావచ్చును వారు ఎవరినైనా పిలిపించి మాట్లాడవచ్చును ఏదైనా జరిపించవచ్చు, సలహాలంటున్నని ఇప్పుడేమీ నిర్ణయించలేదు

Sri R B RAMAKRISHNA RAJU — ఈ విషయం ఇట్లుండగా అరవసోదరులు బ్రహ్మాండంగా దీన్ని గురించి ఏమో చేయవలెనని తీర్మానించారని paper లలో వస్తోంది ఆ విషయములో Madras ప్రభుత్వం వారితో ఏమైనా సంప్రతించారా ?

The Hon Sri B GOPALA REDDI —ఆ విషయములో సంప్రతించే దేముంది ఈ ఆందోళన వట్టిదా ? సంక్షోభం కాదని మదరాసు ప్రభుత్వం ఎప్పుడైనా చెప్పడం లేదు కొట్టేవాళ్ళతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపవలసిన అవసరంలేదు

Sri R B RAMAKRISHNA RAJU — మద్రాసు ప్రభుత్వం వారు చెబితే వింటారనే అభిప్రాయముతో చెబుతున్నాను వారు మదరాసు ప్రభుత్వానికి లోబడినవారే, వారికి కావలసినవారే, కాబట్టి ఈ ఆందోళన వద్దని ఏమైనా ప్రయత్నం చేస్తారా ?

The Hon Sri B GOPALA REDDI — మదరాసు ప్రభుత్వం వారికి సంబంధించినవారు కారు ఆందోళన వాళ్ళు స్వయం కృషిమీదనే వాళ్ళు చేస్తున్నారు మదరాసు ప్రభుత్వం చెబితే కూడా వినేవాళ్ళుకారని మా ఉద్దేశ్యం అందువల్ల వాళ్ళతో సంప్రతింపులు చేసి ప్రయోజనంలేదు

Sri K VIJAYA BHASKARA REDDI — ఈ మధ్య పత్రికలలో C సుబ్రహ్మణ్యంగారు ఇక్కడకు వచ్చినప్పుడు ఈ Boundary విషయం మన ప్రభుత్వంతో చర్చించడానికి వచ్చారని ఒక వార్త ప్రకటించబడింది ఏమైనా సంప్రతింపులు జరిగినవా ? ఎంతవరకూ కొనసాగినాయో చెబుతారా ?

The Hon Sri B GOPALA REDDI — వారు వచ్చింది అందు కోసం కాదు కాని వచ్చినప్పుడు ఈ విషయం కూడా కొంత informal గా discussion జరిగింది అంతేగాని వారు వచ్చిన విషయం మాత్రం అందుకు కాదు

*Arrest of the Romperu Sivoi jamadars*

356—B

* 1469-H Q —Sri PRAGADA KOTAIAH — Will the Hon the Deputy Chief Minister be pleased to state

The number of Romperu Sivoi jamadars arrested during this week in the Romperu area and the reasons therefor ?

The Hon Sri N SANJEEVA REDDI —The number of persons arrested during the week from 16th to 23rd are 22 They were arrested as they trespassed and obstructed political sufferers from doing agricultural work in the lands assigned to them in Kodavalivaripalem

Sri PRAGADA KOTAIAH — ఇందులో ఆడవారెంతమంది? మగవారెంతమంది? తరువాత పోలీసులేదో అమానుషకృత్యాలు చేశారన్న వార్తలు వచ్చాయి? అవి ఎంతవరకూ యదార్థం తెలుపుతారా?

The Hon Sri N SANJEEVA REDDI — మగవాళ్లు ఐదుమంది ఆడవాళ్లు 17 మంది రెండవభాగానికి సమాధానం అది సత్యదూరం

Sri G YELLAMANDA REDDI — అధ్యక్షా! ఈ arrest అయిన వారిలో కొందరు మగవాళ్ల పంచెలు ఊడదీసి గోచులు పెట్టించినసంగతి, ఆడవాళ్లను దుర్భాషలాడినసంగతి, ప్రభుత్వంవారికి ఏమైనా తెలిసిందా?

The Hon Sri N SANJEEVA REDDI —ఆడవాళ్లకుకూడా చీరలు విప్పారని చెప్పనందుకు సభ్యుణ్ణి అభినందిస్తున్నాను

*Report of the Expert Committee for Ayurvedic and Homeopathic Systems of medicines*

356-C

* 1428 A Q Sri M RAJESWARA RAO —Will the Hon the Minister for Planning and Industries be pleased to state

[a] whether the Government have received the report of the Expert Committee for Ayurvedic and Homeopathic systems of medicines appointed by the Government last year,

[b] whether the Committee has made any recommendations to the Government,

[c] whether any recommendations were accepted by the Government,

[d] if so, the recommendations accepted and

[e] whether a copy of the report of the Committee will be placed on the Table of the House

The Hon Sri K VENKATA RAO —

(a) & (b) The answer in the affirmative

(c) & (d) The answer is in the negative

(e) The report of the Expert Committee on Homeopathic system of Medicine is under print A copy of Part I Recommendations of the report of the Committee on Ayurvedic system of medicine will be placed on the *Table of the House*, and it has been placed to day

Sri S VEMAYYA — ఈ Homeopathy institutions మన రాష్ట్రములో recognise అయి గవర్నమెంటు subsidy పొందినవి ఉన్నాయా? ఉంటే, ఎక్కడవున్నాయి

The Hon Sri K VENKATA RAO — అవును Homeopathy system of medicine కూడా recognise చేయలేదు దానికోసం ఒకచట్టము చేయవలసిన అవశ్యకత ఏర్పడినది అది ప్రత్యేకంగా విచారిస్తున్నాము కాని, నేను ఇక్కడనే Medical Demand లో చెప్పినట్లు, గుడివాడలో ఉన్నటువంటి Homeopathy కళాశాలను up to date చేయటానికి Government of India వారు grant ఇచ్చేవిషయంలో సిఫార్సుచేస్తున్నాము

Sri S NARAYANAPPA — ఇప్పుడు రాష్ట్రములో ఉన్నటువంటి ఆయుర్వేదిక్ డాక్టర్లను రిజిష్టర్ చేసే విషయంలో వారిచే ఒక నిర్ణయమైన రుసుము చెల్లింపుచేసి, వారిని register చేసేటటువంటి పద్ధతిని అమలుపరుస్తున్నారు అదేవిధముగానే Homeopathy డాక్టర్లనుకూడా రిజిష్టరుచేసి, మనరాష్ట్రములో Homeopathic doctors ఎంతమంది ఉన్నారో తెలుసుకోటానికి లెక్కలు తయారుచేసే ఏర్పాటు చేస్తారా ?

The Hon Sri K VENKATARAO — ఆ పని చేయడంలో ఏమీ చట్ట మొకటి పెట్టాలని మనవిచేశాను

Sri A KALESWARA RAO — ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఇంకా ఆఖరుగా ఖాయముకాలేదని, నాకు తెలుసును కాని, యీ ప్రణాళికనుక మంజూరు అయినట్లైతే, ఈ వైద్యముక్రింద, public health క్రిందచేసిన మొత్తములో ఎన్ని లక్షలు, లేకపోతే ఎన్నికోట్లు లేకపోతే ఎన్నివేలు Ayurvedic Medicine కుగాను నిర్ధారణచేసి పంపుతున్నారు ?

The Hon Sri K VENKATA RAO — కోట్లకు, వేలకు మధ్య పదిలక్షలు పెట్టామండి

*Constitution of a Panchayat Board at Parakalpapudi*

356-D

* 1543 B Q Sri P SREERAMULU — Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state,

[a] whether there are any proposals for constituting a Panchayat Board at Perakalpapudi Tenali Taluk and

[b] if so, when it is going to materialise ?

The Hon Sri A B NAGESWARA RAO —

[a] and [b] The proposal to constitute a Panchayat for Parakalpapudi village in Guntur District is under the consideration of the Regional Inspector of Municipal Councils and Local Boards, Chittoor He is expected to pass orders on the proposal in due course

Sri P SREERAMULU — ఈ పంచాయితీబోర్డుల స్థాపించేవిషయములో అమలులో ఉన్నటువంటి పంచాయితీచట్టముప్రకారము అయిదువందలకు పైబడిన గ్రామాలలో పంచాయితీబోర్డులు స్థాపించుటకు, అక్కడనుంచి applications రావలెనా, లేక ప్రభుత్వమే initiative తీసుకొని వాటిని ఏర్పాటుచేస్తుందా? అయిదు వందలకు పైబడిన గ్రామాలు చాలా ఉన్నప్పటికినీ అక్కడ పంచాయితీబోర్డులు constitute చేయడానికి ఎందుకు ఇంత ఆలస్యము జరుగుతున్నది?

The Hon Sri A B NAGESWARA RAO ప్రభుత్వమే constitute చేస్తుంది అక్కడనుంచి application వస్తే గాని గుంచిరి తరువాత ఈ విషయములో ఎందుకు ఇంత ఆలస్యం జరుగుతుందన్నారు జిల్లా పంచాయితీఆఫీసరు 10-7-1955 తేదీన Regional Inspector గారికి proposals పంపించారు కాబట్టి వీలైనంత త్వరలోనే పంచాయితీలు form చేయబడుతాయని మనవిచేస్తున్నాను

## STARRED QUESTIONS

*Removal of the equipment of Government Press from Madras to Kurnool*

357—

* 296 Q —Sri S VEMAYYA —Will the Hon the Chief Minister be pleased to state—

[a] Whether the Government removed all the equipment of Government Press from Madras to Kurnool, and

[b] If not, the reasons for the delay ?

The Hon Sri B GOPALA REDDI — Out of 30 per cent share of this Government, some machinery has been transferred to Andhra The question of transferring some more units is under correspondence with the Madras Government

Sri S VEMAYAA — ఇప్పటికే చాలా ఎక్కువగా ఆలస్యం జరిగింది ఇంకా అది సంప్రతింపులలోనే ఉన్నదని చెప్పుతున్నారు ఎంతకాలంలో ఈ సంప్రతింపులు పూర్తిఅవుతాయి ఇప్పుడు ఇతర private presses లో పనిచేసుకోవడంవల్ల ప్రభుత్వానికి ఇబ్బంది కలగడంలేదా?

The Hon Sri B GOPALA REDDI — ఇంకా రావలసిన machinery ఇక్కడికి వచ్చినప్పుడు, దానికి తగినటువంటి భవనముకూడ కావలసియున్నది దానికి ఏర్పాటు జరుగుతున్నది అదికూడ correspondence లో ఉన్నది.

Sri P SUNDARAYYA — ఆ యంత్రాలు తీసుకురాకపోవడానికి ఈ భవన నిర్మాణమా కారణము, లేక ఇంకేమైన ఇతరకారణాలున్నాయా?

The Hon Sri B GOPALAREDDI — భవననిర్మాణముకూడ ఒక కారణమే ఆ machinery ని ఎంతవరకు detach చేసి ఇవ్వడానికి వీలు అవుతుంది అనే విషయములో కూడ వారు ఇంకొక అభిప్రాయములో ఉన్నారు

5th August 1955]

Sri P SURYANARAYANA — Machinery ని detach చేసి ఇవ్వడానికి సిద్ధంగా లేకపోతే అని కొత్తది కొనడానికి అయ్యే డబ్బు ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నారా లేక వారికు, machinery అక్కడే ఉన్నది కాబట్టి, అది పనికు వచ్చేంత వరకు, printing work అంతా చేసి ఇచ్చేందుకు హామీ తీసుకోవడం అనే దేనైన జరుగుతుందా ?

The Hon Sri B GOPALA REDDI ఇప్పుడు రావలసినదాంట్లో ఎక్కువ భాగము వచ్చింది ఇంకా కొంతభాగము మాత్రమే అక్కడ ఉన్నది అది machinery గా ఇవ్వడమా లేక ఏ విధంగా ఇవ్వడమనేది correspondence లో ఉన్నది ఇప్పుడు దానిని కొనడానికి ప్రయత్నిస్తే చాలా డబ్బు అవుతుంది అయినా అది ఇంకా correspondence లో ఉన్నది

Sri P SUNDARAYYA — మన వాటాకు 36 percent రావలసి ఉండగా, ఇప్పటికి ఎంత percentage వచ్చింది, ఏ percentage ఇంకా అక్కడనే ఉన్నది

The Hon Sri B GOPALA REDDI —దివాకర్ గారు, విశ్వనాథం గారు, పట్టాభిరామారావుగారు, ఉన్నప్పుడు, ఒక conference పెట్టి పరిశీలించారు ఆ ప్రకారం, మనకు రావలసిన, ఇవ్వగలిగిన 25 per cent అనే లెక్క వేసినట్లు ఉన్నది దానికిగాను ఇప్పుడు 19 9 per cent వచ్చింది

*Widening of the Bridges on the Pulleru and Bandar Canals*

358—

*780 Q — Sri S R Y SIVARAMA PRASAD — Will the Hon the Deputy Chief Minister be pleased to state—

[a] Whether there are any proposals with the Government for the widening of the bridges on the Pulleru Canal and the Bandar Canal at Pamarru of Krishna district and

[b] If so, whether the Government propose to take up the works during the year ?

The Hon Sri N SANJEEVA REDDI —*Clauses (a) and (b)* Proposals for widening the bridge across the Pulleru canal on the Challapalli Pamarru road are awaited from the Chief Engineer [Highways] Meanwhile, urgent repairs to the existing bridge across the canal have been executed by the Irrigation Department As regards the bridge across the Bandar Canal it is presumed that the Member refers to the bridge across the junction canal at Pamarru situated at M 15/5 of the Masulipatam Vijayavada Road If so, this bridge has already been widened and opened for traffic

[5th August 1955

*Distribution of banjar lands*

359—

* 333 Q —Sri VAVILALA GOPALAKRISHNAYYA —Will the Hon the Minister for Revenue be pleased to—

[a] Place all the Government orders concerning the distribution of the banjar lands on the Table of the House and

[b] If not, why not ?

The Hon Sri K CHANDRAMOULI — *Clause (a)* Copies of the following G Os are placed on the Table of the House ,—*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | G O No 1142 | Revenue Department dated | 18 | 6 | 1954 |
| 2 | G O No 1281, | do | 12 | 7 | 1954 |
| 3 | G O Ms No 2056, | do | 27 | 10 | 1954 |
| 4 | G O Ms No 1045, | do | 7 | 6 | 1954 |
| 5 | G O Ms No 1182 | do | 18 | 6 | 1954 |
| 6 | G O Ms No 1010, | do | 2 | 5 | 1955 |
| 7 | G O Ms No 1291 | do | 6 | 6 | 1955 |
| 8 | G O Ms No 1294, | do | 6 | 6 | 1955 |

*Clause (b)* —Does not arise

*Applications for banjar lands*

360—

* 330 Q —Sri P VENKATASUBBAIAH — Will the Hon the Minister for Revenue be pleased to state —

[a] Whether the distribution of banjar lands have been completed in the State, and

[b] If not, what is the progress made on the following lines

(i) How many applications have been received from the Harijans, ex toddy tappers and others district war, and

(ii) How many applications have been disposed off and patti is granted and amongst them how many are Harijans ex toddy tappers and others ?

The Hon Sri K CHANDRAMOULI — *(a)* The answer is in the negative *

*(b)* and (i) and (ii) §A statement showing the required particulars is placed on the table of the House

* Appendix I at page 355 infra

§ *Vide* Appendix II at page 377 infra.

*Banjar lands Assignment Scheme*

361—

* 390 Q — Sri P RANGA REDDI —Will the Hon the Minister for Revenue be pleased to state—

(a) the total number of applications received in each district for assignment of lands under the 'Banjar lands' assignment scheme, and

(b) how many applications are disposed off in each district up to 31st March 1955 and the total acreage so far granted on Patta in each district ?

The Hon Sri K CHANDRAMOULI —

(a) and (b) — * A statement showing the required particulars is placed on the Table of the House

Sri VAVILALA GOPALAKRISHNAYYA — ఈ G Os ఒక దానితరువాత ఒకటి issue చేస్తున్నారు అవి ఒకటికొకటి contradictory గా ఉన్నాయి అందుచేత అవన్నీ కలిపి consolidated గా ఒక G O final issue గా చేస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI — చివర ఇచ్చిన G O final గా తీసుకోవలెనండి

Sri S VEMAYYA — ఇక్కడ పట్టాలు isolated plots గా ఉన్నట్లయితే ఒక ఎకరం మాగాణిగాని, రెండు ఎకరాలు మెట్టగాని, పట్టాదారుభూమికిఆనుకొనివుంటే అది ఆయనకే ఇవ్వాలని ప్రభుత్వవిధానముగా ఉన్నదాక ఆవిధంగా ఉంటే, ఉన్న వాళ్లకే భూములుపోతాయి కాబట్టి, ఆవిధానాన్ని మార్చడానికి పూనుకొంటారా ?

The Hon Sri K CHANDRAMOULI —ఆ భూము ఊరికే ఇవ్వడం లేదండి పట్టాదార్లకు ఇచ్చేందుకు లేకుండా ఉండాలి, అనే అభిప్రాయంతో దాన్ని మార్కెట్ రేటుకు యిస్తాము

Sri N K LINGAM — ఈ బంజరుభూముల పంపకంలో హరిజనలకు, గీత పనివారికి priority ఇస్తామని చెప్పినందువల్ల, పలుకుబడికలిగినటువంటి వేలకొలది ఎకరాలు పట్టాలుకలిగినటువంటి ఈ తెగవారు చాలామంది నందికొట్కూరు తాలూకాల్లో రాముల చెరువులో ఈ పొలాలు సంపాదించారు అటువంటి ధనవంతులైన ఈ తెగవారి list ప్రభుత్వము ఎదుటపెడితే, వారిని తొలగించి కడు పేదలైనటువంటి కూలీలకు ఇచ్చేందుకు సాహసిస్తుందా ?

---

* Vide Appendix III at page 378 infra.

The Hon Sri K CHANDRAMOULI — భూములున్న వారికి ఇవ్వడం లేదు, భూములు లేని వారికే ఇవ్వడం జరుగుచున్నది

*National Extension Schemes, etc (for Planning) in dry areas*

362—

* 121 Q — Sri G YELLAMANDA REDDI — Will the Hon the Minister for Planning and Industries be pleased to state —

[a] Whether the Government have received the recommendations of Nellore District Planning Committee to the effect that the contribution from the people be reduced from 50 per cent to 25 per cent of the total expenditure for National Extension Schemes, etc (for planning) in dry areas, and

[b] If so the action taken thereon ?

The Hon Sri K VENKATA RAO —

[a] No Not under the National Extension Service but under the Local Development Works Programme

[b] The question of reduction of contribution for Local Development Works in backward areas in the State is under the active consideration of the Government

Sri G YELLAMANDA REDDI — ఇది ఎంతకాలములో తేలుస్తారో సెలవిస్తారా ?

The Hon Sri K VENKATA RAO — కాగితాలు, కలాలు పైనుంచి క్రిందికి దిగివచ్చినవారి అని తేల్చడం జరుగుతుంది

Sri S VEMAYYA — ఈ Local Development works విషయంలో ఒక Reading Room కట్టుకోవాలన్నా గాని, అది Education Department కు పోయి అక్కడనుంచి Finance Department కు పోయి, మళ్ళీ Planning Department కు వస్తుంది ఈవిధంగా చాలా ఆలస్యం జరుగుతున్నది కనుక ఇటువంటి ఆలస్యం జరగకుండా Sanction ఇచ్చేదానికి ప్రభుత్వము ఏదైనా ఆలోచిస్తుందా !

The Hon Sri K VENKATA RAO — Accounts తప్పుతాయనే అభిప్రాయంతో Planning Department తనంతట తాను చేయకుండా ఉండేదానికోసం ఈ restrictions అన్నీ పెట్టారు ప్రతి petty lo al development work ను గురించి proposal Secretariat కు వచ్చినతరువాత అది concerned Department, Finance Department తరువాత Planning Department ద్వారా రావలసియుంటుంది

Sri VAVILALA GOPALAKRISHNAYYA ఈ Local Development కు డబ్బు ఇచ్చేటప్పుడు ఆ పని చేసేటందుకు పదిసెలలకు గాను అయిదువందల

deposit చేయాలని, ఆ పని అంతా చేసినతరువాత అది ఇస్తాము అంటున్నారు అట్లు కాకుండా, పని అయ్యేకొద్దీ ఎప్పటికప్పుడు గవర్నమెంటు భాగము త్వరగా ఇచ్చేటట్లు చేస్తారా ?

The Hon Sri K VENKATA RAO — ఆ ఉత్తరువులు ఇదివరకే వెళ్ళాయి

Sri K SUBBA RAO — ఈ National Extension, Local Development అనేది అభ్యుదయప్రణాళికలో ఒకభాగము గనుక గ్రామాలలో ఉండే ప్రజలకు జీవనోపాధి కలిగేటట్లు, సిమెంటు కొనేదానికిబదులు, local గా ఉండేటటువంటి గారను సున్ని ఉపయోగించుకొనవచ్చునుగదా కాబట్టి లోకల్ గా వుండేటటువంటి material ను ఉపయోగించుకోవలెను అనే సిద్ధాంతాన్ని ప్రభుత్వంవారు ఒప్పుకొని అందుకు తగిన ఉత్తరువు జారీచేస్తారా ?

The Hon Sri K VENKATA RAO — ఈవిషయం విచారణలోవున్నది

## *Telugu Pandits*

363—

* 602 Q — Sri P NARASIMHAPPA RAO — Will the Hon the Chief Minister be pleased to state —

[a] Whether the Government are insisting on a pass in Secondary School Leaving Certificate for Telugu Pandits for appointment and promotion as Grade I Pandits and

[b] If so, whether the Government would relax this rule ?

The Hon Sri B GOPALA REDDI —

[a] The answer is in the affirmative

[b] No, Sir,

Sri P NARASIMHAPPA RAO — అధ్యక్షా ! మనది ఆంధ్రదేశము కనుక ఆంధ్రదేశములో అంటూకూడా తెలుగు పండితులు వున్నారు వీరిని ఇంగ్లీషు పరీక్ష ప్యాసుకావాలని ప్రభుత్వమువారంటున్నారు అందుచేత Pro-Chancellor గా వున్న మన ముఖ్య మంత్రిగారు ఒక నిబంధన ప్రవేశపెట్టినట్లుగా పత్రికలలో కూడా వేయబడ్డది కాబట్టి యిటువంటి నిబంధన లేకుండా తెలుగు పండితులకు exemption యిస్తారా ?

The Hon Sri B GOPALA REDDI — ఈ నిబంధన 1st Grade Telugu Pandits కు మాత్రమే కోరబడింది తక్కిన వారికి కాదు. 1st Grade Telugu Pandits S S L C పరీక్ష ప్యాసు అయితే వారికి ఎక్కువ జీతము కూడా యివ్వబడుతుంది అందువల్ల యీ నిబంధన వారియొక్క లాభము కొరకే గనుక యీ పరీక్ష ప్యాసుకావాలని అన్నాము

Sri V VISWESWARA RAO — Telugu Pandits కు English భాష నేర్చుకోవాలి అనేదానికన్న ఆ యింగ్లీషుకు బదులు హిందీ భాష నేర్చుకోవా

లనే చెబుతూ, అయినా extra జీతము, వారికి యిస్తే మంచిదేమో అనే విషయము ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri B GOPALA REDDI —Secondary Education లోనూ, College Education లోనూ, యింగ్లీషుకు స్థానం వుంటుంది అవిషయము నిర్ణయించినప్పుడు అది చూచుకోవచ్చును ఇంగ్లీషు విషయములో కొంతవరకు general knowledge కూడా వుంటే మంచిదనే ఉద్దేశ్యముతో యీ qualification fix up చేశాము

Sri P SUNDARAYYA — General knowledge వుండడకు సరియైనదే కాని, యింగ్లీషు knowledge వుంటేనే general knowledge వుంటుందని ప్రభుత్వము అనుకుంటున్నదా ? S S L C Certificate యిచ్చినప్పుడు టీచర్లకు యింగ్లీషు subject తీసివేసి, మిగిలిన subjects లోనైనా ప్యాసు అయ్యేటట్లు వీలు కలుగజేస్తారా ? అప్పుడు ప్రభుత్వము యీ హెచ్చు జీతము ఇస్తుందా ? మంత్రిగారికి తెలియకపోతే మరల చెబుతాను general knowledge కోసం ఇంగ్లీషు అవసరము లేదు ఇంగ్లీషు లేకుండా చేసి తక్కినవి ప్యాసు అయితే అప్పుడు S S L C సర్టిఫికేటు యిచ్చేటట్లు చేస్తారా ? అప్పుడు కూడా జీతము హెచ్చు చేస్తారా ?

The Hon Sri B GOPALA REDDI — ప్రస్తుతము General knowledge కి గాను యింగ్లీషు భాషలో పరిచయము వుంటే మంచిదని ప్రభుత్వం వారు అభిప్రాయ పడుతున్నారు అంటే, మనకు భూగోళానికి, హిస్టరీకి, వీటి అన్నింటికీ సరియైనవి తెలుగులో text books లేనందువల్ల, general knowledge కు యింగ్లీషు వుంటేనే మంచిదని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నారు

Mr SPEAKER — You are asking for reforming Secondary Education when you are dealing with Pandits

Sri K SUBBA RAO — మద్రాసురాష్ట్రముతో ఆంధ్రరాష్ట్రము కలిసివున్న సమయములో తెలుగుpandit వర్గాలలో, అక్కడ తమిళులలో కొంతమంది Sanskrit చదువకూడదు అనే కారణముచేత, ఆ పండితులను మాత్రమే ఏర్పాటుచేశారు మనకు యిప్పుడు ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకంగా ఏర్పాటు అయింది కాబట్టి, యీ ఆ పండిత వర్గము తీసివేసి సంస్కృతభాష గాని, లేకపోతే యింకా ఏదైనా చదివి ఉత్తీర్ణులైన వారిని మాత్రమే యేర్పాటు చేస్తారా ?

The Hon Sri B GOPALA REDDI — ఇప్పుడు మనము 363 వ ప్రశ్నలో వున్నాము ఈ ఉపప్రశ్న 367 వ ప్రశ్నవచ్చినప్పుడు యీ విషయము అడిగితే బాగుంటుందని నేను అభిప్రాయ పడుతున్నాను

Mr SPEAKER,—It will be more appropriate then

Sri PILLALAMARRI VENKATESWARLU – High Schools లో భూగోళము, చరిత్ర వగైరాలు ఈ నాడు తెలుగులోనే చెబుతున్నారు General knowledge కూడా తెలుగుభాష చదివినవారికి ఇంగ్లీషు భాష చదివినవారికంటె ఎక్కువగానో, తక్కువగానో వుంటున్నది గనుక యింగ్లీషుభాష

నేర్పుతోవాలనే నిబంధన తీసివేసి వారు నేర్చుకొనుటకు తగిన స్థాయిని బట్టి జీతాలు ఎక్కువ చేయుటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri B GOPALA REDDI — నేర్పేది తెలుగు అయినా నేర్పేవారందరు యింగ్లీషు వచ్చినవారే ఈ భూగోళము, History అను చెప్పేవారు తెలుగులో చెబుతున్నప్పటికి వారందరూ ఏ B A, L T, లు గానో వుండి వుంటున్నారు కాబట్టి వారంతాను అధ్యాపక వర్గములో వున్నారు కాబట్టి వారికి ఇంగ్లీషులో పరిచయముంటే మంచిదని ప్రభుత్వమువారు అభిప్రాయ పడుతున్నారు

Sri A KALESWARA RAO — పండితులు కేవలం భాషను మాత్రమే నేర్పేవారు కాబట్టి వీళ్లలో చాలామట్టుకు తెలుగు భాషతోపాటు యింగ్లీషుభాష కూడా అవసరమని ప్రధానమంత్రిగారు అభిప్రాయ పడుతున్నారు అట్లా అయితే సంస్కృత పండితులు తెలుగుభాష, తెలుగుపండితులు సంస్కృతభాష నిర్బంధంగా నేర్చుకునేట్లు యిది రెండింటికిన్ని సమన్వయము చేయటానికి యీ రెండు తరగతుల వారికి రెండుభాషలుకూడా వుండాలనే నిబంధన పెట్టటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా?

The Hon Sri B GOPALA REDDI — ఈ ప్రశ్న 311 వ ప్రశ్న క్రింద వేస్తే బాగుంటుందని నా అభిప్రాయము

Mr SPEAKER —It will be most appropriate then

Sri P SREERAMULU — Board High School లో వున్న Ist Grade Hindi Pandits కూడా S S L C ప్యాసు కావాలనే నిబంధన వున్నదేమో మంత్రిగారు చెబుతారా ?

The Hon Sri B GOPALA REDDI — ఉన్నదండి

*District Judges, Sub Judges and District Munsiffs in the State*

364—

* 906 Q —Sri M RAJESWARA RAO — Will the Hon the Deputy Chief Minister be pleased to state the number of (i) Harijans and (ii) Backward Classes working as (a) District Judges, (b) Sub Judges and (c) District Munsiffs in the State on 31st March 1955 ?

The Hon Sri N SANJEEVA REDDI —

(i) There is one Harijan working as a district Munsif There are no Harijans in the grades of District Judges, District Magistrates (Judicial) and Sub Judges

(ii) There are no officers belonging to backward classes in the grade of District Judges There is one in the grade of District Magistrate (Judicial) and 10 in the grade of District Magistrates belonging to backward classes

Sri N RAJESWARA RAO — ప్రస్తుతము ఉద్యోగస్థులను నియామకము చేసినప్పుడు Public Service Commission వారు written test లేకుండా viva voce test పెట్టి ప్యాసు చేస్తున్నారు అటువంటి viva voce testలో కూడా అంత కూడా ఒకేరకమైన మార్కులు రావాలనే నిర్ణయము వుండడమువల్ల, హరిజనులుగాని, backward class వారు గాని ప్యాసుకావటానికి అవకాశాలు లేకుండా పోతున్నది కాబట్టి అటువంటివారికి యీ మార్కులు వచ్చే విషయములో ఏదైనా కొంత concession యివ్వటానికి ప్రభుత్వమునకు అభ్యంతరము వుంటుందా ?

The Hon Sri N SANJEEVA REDDI -- ఇప్పటికే వారికి చాలా మట్టుకు concessions యివ్వబడ్డాయి ఇంకా ఎక్కువ concessions యివ్వటానికి వీలవుతుందో వారు అది పరిశీలించాలి గాని, ఆ విషయములో అవన్నీ సులభంగా యిస్తారని చెప్పటకు చాలా కష్టము

*Assignment of Romperu lands*

380—

* 711 Q —Sri PRAGADA KOTAIAH —Will the Hon the Minister for Revenue be pleased

[a] To place on the table of the House copies of the orders and clarifications issued from time to time since June 1954 relating to assignment of the waste lands released by the scheme of improve, ment to the Romperu drain in Bapatla taluk, Guntur district, and

[b] To state the action taken on the suggestions made at the Bapatla Conference held on 11th April 1955, for the distribution of Romperu lands ?

- The Hon Sri K CHANDRA MOULI —

(a) *Copies of the following orders in regard to the assignment of Romperu lands are placed on the Table of the House -

1 G O Ms No 1045, Revenue Department, dated 7 6 1954

2 G O Ms No 1182, Revenue Department, dated 24 6 1954

3 G O No 1574, Revenue Department, dated 19 8 1954

4 G O No 1745, Revenue Department dated 11 9 1954

5 Covernment Memorandum No 51436-A 54-5, Revenue, dated 25 9 1954

---

* Vide Appendix IV at page 379 infra

5th August 1955]

6 Government Memorandum No 51436-A 54-6, Revenue, dated 1 11 1954

7 Government Memorandum No 51436-A 54-7, Revenue dated 9 12 1954

8 G O No 1010 Revenue Department, dated 2-5-1955

(b) The Government have examined the suggestions made at the Bapatla Conference and issued necessary orders in G O No 1010, Revenue Department dated 2 5 1955 a copy of which is placed on the Table of the House [vide answer to clause [a]

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా! ఈ G O వచ్చి మూడు నెలలు అవుతున్నా, అరెస్టులు, శిక్షలు ప్రారంభమయినవి ఇది యింకా ఎంతో దూరము పోయి దుష్ఫలితాలకు దారితీస్తాయి కాబట్టి, ఈ G O ను revise చేయటానికి ప్రభుత్వము పరిశీలిస్తుందా?

The Hon Sri K CHANDRAMOULI — ఇంతకు ముందు నేను గౌరవ సభ్యులు, యితరులు కొంత మంది కూడా అక్రమవిధానాలను అవలంభించినవారిని ప్రోత్సాహించకుండా సక్రమ విధానాలను అవలంభించవలసిన అవసరమును యిదివరకే మనవిచేశాను

Mr SPEAKER — We discussed this subject at great length yesterday We spent quarter of an hour on this subject

Sri PRAGADA KOTAIAH — ప్రభుత్వముయొక్క మొదటి జి ఓ లో స్పష్టంగా "In case of Political sufferers where permanent pattas have been granted interference on the part of Government will lie Where however lands have been only provisionally assigned to political sufferers, the assignment shall be confirmed provided that the lands were not in possession of Sivai jamadars at the time of provisional assignment అని ఉన్నది

దీన్ని గురించి యింత ఖచ్చితంగా ప్రభుత్వము వారి 7 వ జూన్ తేదీ గల మొదటి జి ఓ లో చెప్పి తరువాత మే నెలలో ప్యాసుచేసిన జి ఓ లో దీన్ని complete గా revise చేసి మూడు వేల మందికి అపకారము చేయటంలో ప్రభుత్వానికి వున్న వుద్దేశ్యము యేమిటి?

The Hon Sri K CHANDRA MOULI — 3 వేలు అనే సంఖ్య ప్రభుత్వం వారి ఫస్టు జి ఓ ను గురించి నేను యిదివరకే explain చేశాను కాని అవిధంగా ఏదైనా ఆలోచించి చేయటానికి వీలుఅయిన hard cases వుంటే, వాటి విషయము ఆలోచిస్తాము అని నేను చెప్పాను

Sri P SUNDARAYYA — Hard cases అంటే, నిర్వచనము తెలియజేస్తే, ఉన్న కేసులు అన్నీ హార్డ కేసులే. ఈ మాదిరిగా 2753 కేసులు

వున్నాయి. ఇప్పుడు ఆ కేసులన్నీ మంత్రిగారి దగ్గరకు తీసుకురమ్మంటే అది సాధ్య పడదు కాబట్టి hard cases అంటే, అవి మంత్రిగారి దృష్టిలో ఎటువంటి కేసులో, మంత్రిగారు తెలియజేస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI — ఈ జి ఓ కు వ్యతి రేకంగాను, అన్యాయముగా నడిచిన కేసులు, యింకా యితరత్రా అన్యాయము జరిగిన కేసులు, అని

*Amenities to Zamin areas newly taken over by the Government in Chittoor District*

360—

* 440 Q — Sri R B RAMAKRISHNA RAJU — Will the Hon the Minister for Planning and Industries be pleased to state—

[a] whether it is a fact that Zamin areas including the taluks of the old Karvetinagar zamindari in Chittoor district newly taken over by the Government under the Estates Abolition Act are backward and have not got even basic amenities such as drinking water wells and village communications ,

[b] whether the Government propose to give special consideration to these areas and high priority given to them in planning ,

[c] the areas in Chittoor district where community blocks will be taken up in current year , and

[d] whether the Government propose to give top priority to highly backward areas such as Pathagunta, Devalampet and Royalcheruvu and Vadamalpet Firkas in Puttur taluk in Chittoor district ?

The Hon Sri K VENKATA RAO —

[a] The Zamindari areas taken over by Government under the Estates Abolition Act in Chittoor District are generally backward After they were taken over by Government they have been treated on a par with ryotwari areas in all respects like provision of communications, drinking water wells repairs to irrigation sources etc , None of the areas is neglected Under the various developmental Schemes of Government like Minor Irrigation, Rural Water Supply, Local Development, etc , action is taken to provide more amenities in these areas just as for ryotwari areas

[b] For purpose of planning also, the estate areas are treated on a par with ryotwari areas In the case of Karvetinagar ex zamin area portions of this area are already in the Pallipat and Nagari National Extension Service Block areas, and such areas are already receiving attention under the National Extension Service Scheme In fact the two existing Blocks under the National Extension Service Schemes are located in the Zamindari areas The other ex estate areas in the district have been included in the programme for the formation of National Extension Service Blocks in the District in the Second Five Year Plan along with the ryotwari areas

[c] The question is under consideration

[d] The Government will consider this aspect at the time of selection of Blocks

Sri R B RAMAKRISHNA RAJU గవర్నమెంటు ఏరియాలతోబాటు సమానంగా చూస్తాము అంటున్నారు అంతకంటే ఇంకా ఎక్కువగా చూడాలని నా కోరిక

The Hon Sri K VENKATA RAO —ఇద్దరిదీ ఒకే ప్రతిపత్తి అవడము వల్ల ప్రత్యేకంగా చూడ్డానికి వీలులేదు

Sri M R APPA RAO —అధ్యక్షా! చిత్తూరుజిల్లా కన్నా ఇంకా ఎక్కువగా వెనుకబడిన జిల్లాలు వున్నాయని మంత్రిగారికి జ్ఞాపకము వున్నదా?

The Hon Sri K VENKATA RAO —ఈప్రశ్నలు వేసినవారు ప్రక్కనే కూర్చున్నారు కాబట్టి ఇద్దరూ కలిసి సందేహం తీర్చుకుంటే బాగుంటుంది

Sri B SANKARAIAH — రెండిటిని ఒకే ప్రతిపత్తిలో చూస్తాము అన్నారు ఇదివరకు జమీందారుల క్రింద వుండబట్టి ఆ చెరువులు చాలా శిథిలమైపోయాయి వాటికి ప్రత్యేకత ఇచ్చి వెంటనే develop అయ్యేట్లు చూస్తారా?

The Hon Sri K VENKATA RAO — నాకు N E Service వరకే సంబంధించి వుంది

Sri R B RAMAKRISHNA RAJU —గవర్నమెంటు ఇలాకాకున్నా, జమీన్ ఏరియాకున్నా ఎలాంటి సంబంధము లేదండి ఇప్పుడు గవర్నమెంటు స్వాధీనము వచ్చాయి కాని చెరువులు వగైరాలు చాలా కాలమునుంచి పాడయిపోయి పైర్ల లేకుండా వున్నాయి దీనికి గవర్నమెంటు ఇలాకా కన్నా ప్రత్యేకంగా కొంచెము డబ్బు యిచ్చి త్వరలో అన్ని బాగు చేయించాలని కోరుతున్నాను

Mr SPEAKER –That question has got to be addressed to a differrent quarter, not to the Planning Minister

*Introduction of Sanskrit in Lower Secondary Schools*

307—

* 1145 Q —Sri A KALESWARA RAO – Will the Hon the Chief Minister be pleased to state whether there is a proposal to introduce Sanskrit as a compulsory subject along with Telugu, Hindi and English in Lower Secondary Schools ?

The Hon Sri B GOPALA REDDI — The entire question is under consideration

Mr Deputy SPEAKER — తెలుగు పండితులుగా ఏర్పాటుచేసే వాళ్ళను సంస్కృతములో ఉత్తీర్ణులైన వారినే ఏర్పాటు చేస్తారా? ఏర్పాటు చేసేపక్షంలో ఈ 'సి' తరగతి పండితులు అనేవాళ్ళను ఈ ప్రాంతాల్లో తీసివేసే దానికి పూనుకొంటారా?

The Hon Sri B GOPALA REDDI —ఆంధ్రా యూనివర్సిటీకి సంబంధించినంత వరకు ఈ భాషా ప్రవీణం చదివే వారికి సంస్కృతము కూడా వున్నది మద్రాసు యూనివర్సిటీకి సంబంధించి తిరుపతిలో వున్నటువంటి ఓరియంటల్ స్కూలులో D తరగతి విద్వాంసులు వున్నారు వాళ్ళకు అక్కడ సంస్కృతములేదు అది తిరుపతి వెంకటేశ్వర యూనివర్సిటీవాళ్ళు చేయవలసిన విషయము ఏమైనప్పటికి వాళ్ళయొక్క అభిప్రాయము కూడా తీసుకొంటాము

Sri A KALESWARA RAO — అధ్యక్షా, నేను తెలుగులో ప్రశ్న పంపిస్తే ఇంగ్లీషులో అచ్చువేయబడింది లోవరు సెకండరీ స్కూళ్ళు అని కాదు, సెకండరీస్కూళ్ళు అనివుండాలి తప్పుపడింది అనగా ముఖ్యముగా IV Form మొదలు కొని VI Form వరకు పెట్టాలని ఈమధ్య ప్రపోజలు జరిగినట్లు కన్పడుతుంది దానిని గురించి ఆందోళన ఎక్కువగా వున్నది విద్యార్థులు, విద్యార్థుల తలిదండ్రులు కూడా, ఈ 4 భాషలును పిల్లల నెత్తిమీద నిర్బంధంగా కట్టడము చాలా కష్టముగా వుంటుందని ఎంచడంవల్ల ఆందోళన జరుగుతున్నది ఇది ప్రభుత్వ దృష్టికి వచ్చిందా ?

The Hon Sri B GOPALA REDDI — వచ్చింది ఈ విషయములో ఇతర రాష్ట్రాల్లో ఏమి జరుగుతున్నదోగాని అది కనుక్కోడానికి ప్రయత్నము జరుగుతున్నది Head Masters అందరి యొక్క అభిప్రాయము కనుక్కోడానికి D P I ప్రయత్నము చేస్తున్నారు దాంట్లో త్వరపడి జరిగేది ఏమీలేదు ఏమైనప్పటికి సంస్కృతము అనే విషయము లేకుండా తెలుగునే బలపరచడం ఎట్లా అనేటటువంటి దృష్టితోనే ఇది అంతా పరిశీలింపబడుతున్నది ఆందోళనకు ఆస్కారములేదు

Sri P SUNDARAYYA — ఇంగ్లీషు కూడా నిర్బంధంగా కొనసాగించబడుతోంది కాబట్టి, దానితోకూడా పరిపక్వవిజ్ఞానము వుండే దానికి గ్రీకు, లాటిన్‌లు కూడా నిర్బంధంగా ఆంధ్రదేశంలో ప్రవేశపెడుతారా ?

The Hon Sri B. GOPALA REDDI — అటువంటి ఉద్దేశం ప్రభుత్వానికి లేదు

Sri G YELLAMANDA REDDI — అధ్యక్షా, ఈ హిందీ, ఇంగ్లీషు ఇలా అన్నీ నిర్బంధంగా ప్రవేశపెట్టడమువల్ల విద్యావిధానం దెబ్బతింటున్నదని ప్రభుత్వానికి తెలుసా ?

The Hon Sri B GOPALA REDDI — మీరు ముందుగానే చెప్పిన ఈ విషయంలో Head Masters యొక్క అభిప్రాయములు తెలుసుకోడానికి D P I ప్రయత్నిస్తున్నారు

Sri S BRAHAMAYYA — నిర్బంధం చేసే విషయం ఆలోచనలో వున్నదన్నారు ఇంతేగాక, Head Masters నుంచి అభిప్రాయము సేకరిస్తున్నామన్నారు వీటితోపాటుగా విద్యావేత్తల అడ్వయిజరీ కమిటీని వేసే ఆలోచన ఏమైనా వున్నదా ?

The Hon Sri B GOPALA REDDI సెకండరీ విద్యకోసం చిన్న కమిటీని ఒకటి వేసినారు అంటున్నా ఇప్పుడు వేరే అడ్వయిజరీ కమిటీ వేసే వుద్దేశ్యము ప్రభుత్వము యొక్క మనస్సులో లేదు

Sri PILLALAMARRI VENKATESWARLU — ఇప్పుడు ఈ విషయం ఆలోచించేటప్పుడు ఇంగ్లీషుయొక్క స్థానాన్ని గురించి కూడా ఆలోచించి ఇంగ్లీషును నిర్బంధంగా కాకుండా వదలిపెట్టే విషయము పరిశీలిస్తుందా ?

The Hon Sri B GOPALA REDDI — మరికొంతకాలము అయితే పరిశీలిస్తాము

Sri K VIJAYABHASKARA REDDI — ఈ విద్యావిధానములో 1945నుంచి ప్రతిసారి మంత్రివర్గాలు మారినప్పుడు విద్యావిధానములో మార్పు వస్తున్నది ఒక్కొక్క మార్పువల్ల కొన్ని జనరేషన్స్ ఆఫెక్ట్ అవుతున్నాయి కనుక అటువంటి మార్పులు ఇకముందు తీసుకురాకుండా ఒక స్థిరమైన విధానం ఏర్పాటుచేయడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri B GOPALA REDDI — అభ్యుదయము అంతా మార్పులలోనే వున్నది

Sri P SREERAMULU — సంస్కృతము ఇంట్రడ్యూస్ చేసే స్కీము అమలులోకివస్తే సంస్కృతపండితులుగా కనీసం కొంతవరకైనా ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళను నియమిస్తారా ?

The Hon Sri B GOPALA REDDI ఇంగ్లీషులో జ్ఞానము అవసరమని ఇందాకనే చెప్పానుకదా ?

Sri A KALESWARA RAO — పంచాయితీలను నిర్మించేటప్పుడు ప్రతి తెలుగు పండితుడికి సంస్కృతము తెలిసివుండేట్లు, ప్రతి సంస్కృత పండితునికి తెలుగు తెలిసివుండేట్లు, నిర్బంధంగా ప్రభుత్వము చేసేట్లయితే తెలుగు కూడా బలపడుతుంది అని ప్రభుత్వానికి తెలుసా ?

The Hon Sri B. GOPALA REDDI ,—ఆ సలహాకు నా ధన్యవాదాలు

Sri PRAGADA KOTAIAH — ఇంగ్లీషు రానివారికి లోకజ్ఞానము లేనట్లుగానే ప్రభుత్వము భావిస్తుందా?

Mr SPEAKER — It does not arise

*Construction of buildings for the Collector's office and other District Offices in Srikakulam*

308—

* 1073 Q — Sri P SURYANARAYANA — Will the Hon the Deputy Chief Minister be pleased to state —

(a) whether the Government are aware that in the composite Madras State a provision was made in the budget for the construction of buildings for the Collector s office and other District Offices in Srikakulam, and

(b) whether there are now any proposals with the Government for the construction of these buildings this year ?

The Hon Sri N SANJEEVA REDDI —

(a) No provision was made in the budget in the composite Madras State for the construction of buildings for the Collector's office and other District Offices in Srikakulam

[b] The Government have sanctioned an estimate for Rs 8,00 000/- for the construction of a building for the Collector's Office, etc , at Srikakulam and also the acquisition of an extent of Ac 41 00 of private land in Srikakulam town at an approximate cost of Rs 56 500 for putting up the building There is a provision of Rs 8 00,000/- in the Budget Estimate for 1955 56 for the construction of the building Steps are being taken to acquire land The building work will be commenced as early as possible

ఎనిమిది లక్షలు బడ్జెటులో ఏర్పాటుచేశాము భూమికూడా ఎక్వైయిర్ చేశాము వారికి తెలుసును ఇది ఎప్పుడో బడ్జెటు మాదకముందు పంపిన ప్రశ్న అయి వుంటుంది అందరికీ తెలిసినదే త్వరగా ఎక్వైయిర్ చేయడానికి, కట్టడానికి ఆలోచిస్తున్నాము

Sri P SUNDARAYYA — కట్టినతరువాత వర్షాలు వచ్చినప్పుడు రాత్రి తలమీద నీళ్ళు పడనట్లు కట్టుతారా ? పడకుండా కట్టుతారా ?

The Hon Sri N SANJEEVA REDDI — అప్పుడప్పుడు వంటిమీద నీళ్ళు పడుతోంటే ఆరోగ్యానికి మంచిది ఆ రకంగా కట్టుతాము

5th August 1955]

*Division of properties between the Trustees and Archakas*

369—

* 1151 Q —Sri A KALESWARA RAO — Will the Hon the Minister for Revenue be pleased to state—

[a] whether the Government are aware of the agreement prepared by Sri T Viswanatham Ex Finance Minister Commissioner, Hindu Religious Endowments, Board and Advocate General for division of properties between the Trustees and Archakas

[b] if so what are its details

[c] whether the Trustees' Association have sent any objections to the Government now stating that they were not consulted in the matter, and

[d] the steps taken by the Government to bring about an agreement between Trustees, Archakas and other temple servants without going to courts ?

The Hon Sri K CHANDRAMOULI —

[a] & [b] The proposal has not yet been finalised — Vide answer to clause [d]

[c] Yes

[d] It has been decided that compromise proposals previously approved should be kept in abeyance and that representatives of trustees and Archakas should jointly explore the possibility of evolving an agreed formula within 2 months

Sri A KALESWARA RAO — ఈ అర్చకులకు సరియైనటువంటి విజ్ఞానము వుండాలి ఆగమశాస్త్ర విషయములో కొంతటి టువంటి శిక్షణకూడా కావాలి కేవలం ఆస్తుకు వంశపారంపర్యంగా వాళ్ళకు వుంటే వారు తెలివిగలవారు అయినా కాకపోయినా అర్చకులుగా నియమించడంవల్ల ఎక్కువ నష్టముతోంది కనుక శిక్షణనిచ్చి అర్చకులను పెట్టడము సంగతేమో ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri K CHANDRA MOULI — అర్చకత్వము చేసే విజ్ఞానము వారికి వుండాలని ప్రభుత్వమువారు కూడా భావిస్తున్నారు దానికి ట్రెయినింగు ఇవ్వాలని ఆలోచిస్తున్నాము కాకపోతే రెండవ విషయం అది ఆలోచనలో వున్నదని ఇదివరకు చెప్పాను

Sri PILLALAMARRI VENKATESWARLU — ఈ అర్చకుల విషయములోపాటు రిలిజియస్ ఎండోమెంట్సు యాక్టు అంతటినీ కూడా సవరించడానికి ఒక కమిటీని ప్రభుత్వము వేసింది దాని రిపోర్టు కూడా ప్రభుత్వము దగ్గర వున్నది దానిని అమల్లోకి తీసుకురావడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

The Hon Sri K CHANDRAMOULI —అది ప్రభుత్వము యొక్క ఆలోచనలో వున్నది ఇంకా కొన్ని సవరణలు అవసరమేమో అని అనుకొంటున్నాము. సమగ్రమైన రిపోర్టు తీసుకువచ్చిన తరువాత ఆయాక్టు సవరణ చేయడానికి ప్రయత్నిస్తాము

Sri P SUNDARAYYA —అర్చకులకు జీతం ఎంత ఇస్తున్నారు ?

The Hon Sri K CHANDRAMOULI — ఆలోచనలో వున్నది

Sri P SUNDARAYYA — వారుగాని ఇంగ్లీషును నేర్చుకుంటే ఎక్కువ జీతాలు యిచ్చేదానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri K CHANDRAMOULI వాళ్ళకు ఇంగ్లీషు నిర్బంధంగా లేదు కావాలని చెప్పలేదు

Sri P SUNDARAYYA —నిర్బంధం లేకపోయినా వాళ్ళ స్వత సిద్ధంగా నేర్చుకుంటే ఎక్కువ జీతాలు ఇస్తామని వాగ్దానములు చేస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI —జీతాలు ఇవ్వకగాని నేర్చుకుంటే మంచిది

Sri N VENKAIAH —అర్చకుల శిక్షణకు పాఠశాలలు ఎప్పుడు ప్రారంభిస్తారో సుమారు తేదీ చెప్పగలరా ?

The Hon Sri K CHADRAMOULI — తేదీ సరిగా చెప్పలేను అది ఆలోచనలో వున్నదని మనవి చేశాను

Sri B APPA RAO — దేవుని ప్రమింగేవారిని అర్చకులుగా నియమిస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI — దేవుని ప్రమింగేవాళ్ళు ఆ ప్రశ్న వేయకూడదు

*Grant of loans to Artisans under the State Aid to Industries Act*
370—

* 874 Q —Sri PRAGADA KOTAIAH — Will the Hon the Minister for Planning and Industries be pleased to state—

[a] The number of applications received during the year 1954–55, from artisans engaged in Cottage Industries for grant of loans under the State Aid to Industries Act and the amount of loans sanctioned and disbursed, and

[b] The number of applications rejected and the reasons for the same ?

The Hon Sri K VENKATARAO —

*(a)* [1] Number of applications received during 1954–55 for grant of loans under the cottage Industries loans and subsidy Rules 1948,

5th August 1955]

[2] Amount of Loans Sanctioned Rs 16 950

[3] Amount of Loans disbursed Rs 9,800

*(b)* Ninety two applications for grant of loans under the Cottage Industries loans and subsidy Rules 1948' were rejected during 1954 55 The reasons for the rejection of the applications in general are as follows –

[a] The insufficient security offered by the applicant

[b] The failure of applicants to execute in the prescribed time the necessary bonds for the disbursement of the loans after their sanction

[c] The recomendations of the concerned Tahsildars and Assistant Director of Industries and Commerce's for rejection of the application on various grounds

Sri PRAGADA KOTAIAH — అవసరమయితే 500 రూపాయల నుంచి 250 వరకు తగ్గించి స్వంత పూచీపైన artisans కు అప్పులిచ్చే విధానము ప్రవేశపెట్టుతుందా ?

The Hon Sri K VENKATA RAO — నేను ఇదివరకే చెప్పాను 300 రూపాయలు అంతకు తక్కువ కావాలని దరఖాస్తులు పెట్టే వారికి security అక్కరలేదు

Sri P VENKATASUBBAYYA — Reject చేసిన applications ఎవరెవరివో తెలియజేస్తారా

The Hon Sri K VENKATA RAO — మా office కు వచ్చి చదువుకో మని నా కోరిక

*Extension of Electricity for Agricultural purposes*

371—

* 758 Q —Sri P GOPALAKRISHNA REDDI — Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state—

[a] whether there are any proposals with the Government to extend Electricity for agricultural purposes in Gudur and Sullurpet taluks of Nellore district, and

[b] if so, when it will be taken up ?

The Hon Sri G LATCHANNA —

[a] The answer is in the affirmative

[b] Two schemes sanctioned already are under construction and they are expected to be completed before 31-3-56. Besieds

these, three schemes are under *the active consideration* of the Government and they will be taken up for execution as soon as they are sanctioned

Sri P GOPALAKRISHNA REDDI — అధ్యక్షా! వ్యవసాయదారులకు electricity ఎప్పుడు ఇస్తారో సెలవిస్తారా ?

The Hon Sri G LATCHANNA — రెండు లక్షల ఇర్వది అయిదు వేల రూపాయల estimation కలిగినటువంటి scheme అది execution అవుతున్నది March 1956, లోగా పూర్తిచేయాలని ప్రభుత్వము అనుకుంటున్నది

Sri T G THIMMAIAH SETTY — Agricultural purposes కు electricity rate తగ్గించే అభిప్రాయము ప్రభుత్వము దగ్గర ఉన్నదా ? తరువాత writ విషయంలో ప్రభుత్వము ఏమిచేసింది ?

Mr SPEAKER — It has already been once asked and answered in the House

The Hon Sri G LATCHANNA — నిన్న మంత్రివర్గము వారు తుది నిర్ణయము చేసినారు Advocate-General గారు revise చేసుకోవచ్చు అని opinion ఇచ్చారు Rates గురించి మంత్రివర్గము నిర్ణయము చేశారు అది ఈరోజో రేపో ఆ ప్రకటన జరుగుతుంది

Sri B SANKARAIAH — ఇప్పుడు sanction అయినప్పటికి, 1956 మార్చి నాటికి పూర్తిచేస్తారని అన్నారు దానికి ఏమి చర్యలు తీసుకున్నారు ?

The Hon Sri G LATCHANNA — ప్రతి ఇంజనీరుకు త్వరగా ఈ స్కీము expedite చేయాలని general orders ఇవ్వబడినవి Materials ను తెప్పిస్తున్నారు కొన్ని materials poles కు సంబంధించినవి Madras harbour కు చేర్చబడ్డాయి అవి త్వరలోనే అన్ని centres కు చేర్చబడతవి,

Sri D KONDAIAH CHOWDARY — నెల్లూరులో కందుకూరు తాలూకాకు extend చేయుటకు ప్రభుత్వ ఆలోచనలో ఉన్నదా ?

The Hon Sri G LATCHANNA — ప్రతి జిల్లాకు, ప్రతి తాలూకాకు పథకములు ఉన్నవి వివరములు కావాలంటే వేరే ప్రశ్న వేయించండి

Sri T JALAYYA — తగ్గించిన రేటు పాతరేటా, క్రొత్త రేటా, ఒక్క రకము రేటా అండి

The Hon Sri G LATCHANNA — అమలులో వున్న రేటు తగ్గించడము జరిగింది

*Purchase of Fire Engines in the State*

872—

* *1101 Q* — *Sri V VISWESWARA RAO* — Will the Hon the Deputy Chief Minister be pleased to state—

[a] when the present Fire Engines in the State were purchased and put into service,

[b] whether any of them have since been replaced by new ones, and

[c] if so, why ?

The Hon Sri N SANJEEVA REDDI —

[a] " Most of the existing Fire Service Vehicles viz 40 Trailer Pumps 32 Mobile Tank Units, 29 Tenders and 10 Ambulances were taken over from the defunct A R P Organisation Only 18 Vehicles were purchased after 1949 i e after the merger of Fire Service Branch into the Police Department as shown below

| | | *Fire Tenders* | *Ambulances* |
|---|---|---|---|
| 1 | 1949 | — | 3 |
| 2 | 1950 | 2 | 7 |
| 3 | 1951 | 2 | 4 |
| | Total | 4 | 14 = 18 |

[b] " The answer is in the negative "

[c] " Does not arise '

Sri V VISWESWARARAO — ఈ fire engines అన్నికూడా ఎక్కడైనా ఇల్లు తగలబడితే వాటిని ఆర్పడానికి ముందు ఇవి చెడిపోతున్నవి వీటిని replace చేయవలెనని ప్రభుత్వమునకు petitions వచ్చినవా? (2) fire engines చెడిపోయినప్పుడు బాగుచేయడానికి అక్కడ ఉన్నవాళ్ళకు 5% contingencies ఇస్తున్నారు అందుచేత బాగుచేయడానికి అవకాశములేకుండా ఉన్నదని వారు చెప్పుచున్నారు ఈ విషయము ప్రభుత్వదృష్టికి వచ్చిందా

The Hon Sri N SANJEEVA REDDI — అవి పూర్తిగా చెడిపోతే condemn చేస్తున్నారు ఇప్పటికి 20 vehicles వరకు condemn చేశారు కొత్తగా కొన్నారు ఇంకా కొనడానికి అవకాశమున్నప్పుడు ఎక్కువగా కొంటాము

Sri P SREERAMULU — Fire engines సంఖ్యమాత్రే fire accidents జరిగినచోట గుబుర్దతర్వాత మిగిలిన నిప్పును చల్లార్పడానికి ఉపయోగిస్తున్నట్లు ఉన్నది అందువల్ల సంఖ్యను పెంచేఉద్దేశ్యము ప్రభుత్వమునకు ఉన్నదా ?

The Hon Sri N SANJEEVA REDDI — ఊరుకొక fire engine పెట్టాలని ఆశగా ఉన్నది కాని శ్రీరాములుగారు ఈ బడ్జెటును పూర్తిగా ఎప్పుడు అవకాశమిస్తే అప్పుడు ఉపయోగించుకుంటాము

Sri PILLALAMARRI VENKATESWARLU — మనకు ఉమ్మడి మద్రాసురాష్ట్రమునుండి వచ్చిన కొనుకలాటోలు అన్నీ చెడిపోయినవే వచ్చి

నట్లున్నవి వీటిని అన్నింటిని ఆలోచించి క్రొత్తవిధమైనవిషయం చూస్తారా ? లేకపోతే ఇంకొకప్రాప్తకము ఆ ప్రపథముగా అమలుజరుగుటలేదు

The Hon Sri N SANJEEVA REDDI – ఇది ఎవరికీ తెలిసిన కొరకండి ఇక్కడ పుస్తకములన్నీ ఇక్కడే ఉండిపోయి మద్రాసు గోడౌనుగా ఇప్పటికి ఉన్నవి మన ఒక్కరికే కాదు వారికీ కావాలని చెడిపోయినవన్నీ మరలు ఇవ్వలేదు

Sri P RAMACHARLU — Fire Engines ఉపయోగించే కాలంలో గ్రామాలలో బావులలో నీళ్లు చెడిపోయినవి అటువంటి వాటిని clean చేయడానికి వీటిని ఉపయోగించేటట్లు చేస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI — ఏదో క్రొత్తసలహా ఇది దీనిని పరిశీలించాలి అటువంటి అవకాశము ఉంటే తప్పకుండా ఉపయోగించడానికి ప్రయత్నము చేస్తాము

Sri VAVILALA GOPALAKRISHNAYYA — గుంటూరులో fire engines లో work చేసేది ఒకటి కన్పడుతూ ఉన్నది కాని అది చాలా నిరుపయోగముగా ఉన్నది అవి అన్నీ చెడిపోయినవి కనుక అవి సరియైనపద్ధతిలో నుండేటట్లు చూస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI — ఒక్కటేకాదు, చాలా ఉన్నవి అయితే వాటిని అన్నీ చూడడానికి అవకాశములేదు అందువల్ల ఎప్పుడు ఒక్కటే కనిపిస్తుంది అన్నీ పనిచేస్తూనే ఉన్నవి

*Water supply scheme for the Parvathipuram Town*

378—

* 1062 Q —Sri P GUNNAYYA ,-Will the Hon the Minister for Planning and Industries be pleased to state whether the public and the Members of Legislative Assembly of Parvathipuram town, Srikakulam district consisting of a population of 30,000 have submitted memorandum to the Government several times to give protected water supply and if so the action taken thereon ?

The Hon Sri K VENKATA RAO —

The answer is in the affirmative The investigation of a water supply Scheme for the Parvathipuram Panchayat at a cost of Rs 14 000/ has been sanctioned and it is proceeding Detailed plans and estimates will be sonctioned proceeding Detailed plans and estimates after the investigation is over and the report is receieved from the Chief Engineer, Public works Department [General and ,Buildings], Kurnool

5th August 1955]

Sri P GUNNAYYA — అధ్యక్షా ! మంత్రిగారు సెలవిచ్చింది తెలుగులో చెప్పినట్లయిన supplementary ప్రశ్న వేస్తాను.

Mr SPEAKER — ఆలోచిస్తామన్నారు

Sri P GUNNAYYA — ఏమో ఏమిచెప్పారో నాకేమీ తెలియలేదు కనుక supplementary వేయాలని అనుకొంటున్నాను

Sri A KALESWARA RAO — Point of order, Sir, ఇందులో కొంతమందికి చాలామందికి ఇంగ్లీషురాదు అందువల్ల మంత్రిగారిని తెలుగులో చెప్పమనుటకు సదుపాయంగా తీర్చిన supplementary లు వేయుటకు అవకాశము యివ్వకొంటుంట సరైనదికాదని మా దృష్టికి తీసుకువస్తున్నాను

Mr SPEAKER — The language according to rule is English I cannot force the Minister to talk in Telugu

The Hon Sri K VENKATA RAO — Nobody could be compelled How did the Member put the question in English I definitely know that the question was put in English

Sri P GUNNAYYA — నేను కూడా question తెలుగులోనేయిచ్చాను దానిని ఇంగ్లీషులోకి ప్రభుత్వమువారు మార్చారు తెలుగులో supplementary question వేయటానికి మంత్రిగారు తెలుగులో చెబితే నేను supplementary question వేయడానికి అవకాశము ఉంటుంది

Mr SPEAKER — నేను రద్దుమా చేశాను అది ఆలోచనలో ఉన్నదని మంత్రిగారు చెప్పారని మీరు అనుకున్నారు కాదు మంత్రిగారి నోటివెంటే మీకు తృప్తి అనుకుంటాను

Sri P SUNDARAYYA — తెలుగులో సంబంధించే ప్రశ్నలు తెలుగులోనే అచ్చువేస్తే బాగుంటుంది భాషాంతరీకరణకు వారి కొంటాలు వారు ఎడతారు అందుచేత తెలుగులోనే వచ్చేటట్లు చూడాలి

Mr SPEAKER —I will ask the Government to consider it

*Survey of Rural Credit*

374—

* 489 Q — Sri S VEMAYYA —*Will the* Hon *the* Minister for Co operation and Commercial Taxes be pleased to state—

[a] Whether there is any report with the Government regarding the Survey of Rural Credit, and

[b] If so, whether it will be placed on the Table of the House ?

The Hon Sri D SANJIVAYYA —*(a) and (b)* The Hon'ble Member apparently refers to the General Report, Volume II

of the Report on the All India Rural Credit Survey recently published by the Reserve Bank of India A copy of the Report is placed on the Table of the House

Sri P VENKATASUBBAYYA — Point of information Rural credit survey report table మీద పెట్టాం అన్నారు కాని ఇక్కడ లేదు

Sri VAVILALA GOPALAKRISHNAYYA — అక్కడ copy పెట్టడం అంటే మెంబర్లు ఆ వారంలో notice room లో యిస్తారు పార్లమెంటులో కూడా table మీద పెట్టాం అంటే అర్థం అదే

Mr SPEAKER It is available in the Library Hon Members who are interested to know, can go to the Library and read it Only four copies are available One copy is available in the Library and the three are available on the Table

Sri VAVILALA GOPALAKRISHNAYYA —ఎప్పుడైతే table మీద పెట్టాం అన్నారో అప్పుడు notice room లో తీసుకోమని parliamentary భాషలో అర్థం

Sri S VEMAYYA — Rural credit survey ఆంధ్ర ప్రాంతాలలో ఏ ఏ ప్రదేశాలలో తీసుకున్నారు? వారి ఆర్థిక పరిస్థితులను అభివృద్ధి చేయడానికి ఏవిధంగా పూనుకుంటారో తెలుసుకోవచ్చా?

The Hon Sri D SANJIVAYYA —రిపోర్టు ప్రకారం లాంఛన ప్రకారము ఒకటి రెండు జిల్లాలలో ప్రయత్నం చేయాలని అనుకుంటున్నారు ఆ విషయంలో Registrar ను ఒక రిపోర్టు అడిగినాము ఆ రిపోర్టు రాగానే యీసంవత్సరం అమలు పరచడానికి ప్రయత్నిస్తాం

Sri VAVILALA GOPALAKRISHNAYYA —ఆజిల్లాలు మీ పూజ్యులైన మంత్రులున్న చోట్లకే వస్తాయి ఇదివరకు ఒకటి అడిగితే ముగ్గురు మంత్రిగార్లున్న చోట యిస్తాం అన్నారు ఇప్పుడు కూడా అదే యిస్తారా?

The Hon Sri D SANJIVAYYA —అటువంటి సందేహము ఎప్పుడూ పెట్టుకో కూడదని మనవి చేస్తున్నాను

*Constitution of District Panchayat Councils*

375—

* 947 Q —Sri M RATESWARA RAO —Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state whether there are any proposals with the Government to constitute "District Panchayat Councils", in place of the existing District Boards?

The Hon Sri 4 B NAGESWARA R\O — The answer is in the negative

ప్రభుత్వానికి Taluq Panchayat Councils ఏర్పాటు చేసే అభిప్రాయం ఏమీ లేదు

Sri M RAJESWARA RAO — గత మంత్రివర్గం ప్రస్తుతం వున్నటువంటి జిల్లాబోర్డుల స్థానే జిల్లా పంచాయతీ Council ఏర్పాటు చేయాలని నిర్ణయించినట్టు నా దృఢవిశ్వాసం ఐతే ఆ అభిప్రాయాన్ని ఈ మంత్రివర్గం ఎందుకు మార్చుకోవలసి వచ్చింది? ఇప్పుడు మీరు ఏర్పాటు చేయబోయేటటువంటి జిల్లాబోర్డుల స్వరూపంలో ఏమయినా మార్పు వుంటాయా? మంత్రిగారు తెలవిస్తారా?

The Hon Sri A B NAGESWARA RAO — ఈ జిల్లా బోర్డులు ఏర్పాటు కాబోతున్నాయి Proposals ప్రభుత్వం ఆలోచనలోనున్నాయి అవన్నీ అయిన తరువాత సభవారి ముందు పెట్టబడతాయి

Sri VAVILALA GOPALAKRISHNAYYA — తమరు జిల్లా బోర్డులే ఏర్పడబోతున్నాయి అన్నారు కనుక మా ప్రశ్నకు చోటులేకుండా పోతున్నది ఈ నడుంగా Councils ఏర్పరుస్తారని, indirect elections పెడతారని, Panchayat Board మెంబర్లు electorate గా cabinet నిర్ణయిస్తారని మేము చదివాము అదంతా అబద్ధమని మళ్లా జిల్లాబోర్డులు restore చేస్తారని అనుకోవచ్చునాండి?

The Hon Sri A B NAGESWARA RAO — మీరు చదివినదానికి ప్రభుత్వం ఏమీ బాధ్యులుకాదు

Sri B SANKARAIAH — ఇప్పుడున్నటువంటి time పొడిగించకుండా ఆ time లోపల జిల్లాబోర్డుల elections పెడతారా?

The Hon Sri A B NAGESWARA RAO — చేయాలనే ప్రభుత్వం ఆలోచిస్తున్నది

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా! ఇప్పుడు ఏర్పడబోయే జిల్లాబోర్డులు పూర్వం వున్న జిల్లాబోర్డుల స్వభావంలోనే వుంటాయా? స్వరూపంలో ఏమయినా మార్పుంటుందా?

The Hon Sri A B NAGESWARA RAO — అది ఆలోచనలో వున్నాయని మనవిచేశాను, వారు వినలేదేమో

Sri P SURYANARAYANA — అధ్యక్షా! ఇవి ఎన్నాళ్ళలో వస్తాయో మంత్రిగారు తెలవిస్తారా?

The Hon Sri A B NAGESWARA RAO — December 10 వ తారీఖువరకు అని Act provision ప్రకారంగా వున్నది. అంతవరకులోపుగానే చేయాలనే ప్రయత్నం చేస్తాం

Sri A KALESWARA RAO — ఆలోచనలో వున్నది అన్నారు మంత్రిగారు జిల్లాబోర్డుకు మామూలు voters లు అంతా voters లు గా వుండడమా లేకపోతే పంచాయతీబోర్డు మెంబర్లు మాత్రమే voters గా వుండడమా? అదికూడా ఆలోచనలో వున్నదా?

The Hon Sri A B NAGESWARA RAO — మీరు చెప్పినవన్నీ కూడా ఆలోచనలో వున్నాయి

Sri A KALESWARA RAO — ఐతే, ఆలోచనలో వుంటే వారు చెప్పిన రెండో పేరుకు వర్తిస్తుందా లేదా?

The Hon Sri A B NAGESWARA RAO — జిల్లాబోర్డులు ఏర్పడబోతున్నాయని మనవిచేశాను వాటికి proposals అన్నికూడా ఆలోచనలో వున్నవని మనవిచేస్తున్నాను

Sri M NAGESWRA RAO — ఇప్పుడే రెండు విధానాలు ఆలోచనలో వున్నాయని మంత్రిగారు శెలవిచ్చారు దీనిని నిర్ణయించేలోపల ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందాండి?

The Hon Sri A B NAGESWARA RAO — ప్రభుత్వం నిశ్చయించిన తరువాత సభవారి ముందుకు వస్తుందని మనవిచేశాను కదండి సభవారికి తెల్పాల్సినదంతా

Sri H RAMALINGA REDDI — అన్ని సంగతులు ఆలోచనలో వుంటున్నాయంటున్నారు ఆలోచనలో లేనివేమయినా చెబుతారా?

The Hon Sri A B NAGESWARA RAO — మీరు ఏదయినా సూచనచేస్తే లేనివేవో చెబుతాను

Sri P GUNNAYYA — అధ్యక్షా! కనీసం 4, 5 మాసాల క్రితం చూశాను, జిల్లాబోర్డులు ఏర్పాటుచేస్తారని పేపర్లో వచ్చింది తాలూకాబోర్డులు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం తలపెట్టిందా అని మనవిచేస్తున్నాను

The Hon Sri A B NAGESWARA RAO — గున్నయ్యగారికి మనవిచేస్తున్నాను ప్రభుత్వానికి అటువంటి అభిప్రాయం ఏమీలేదని

Sri G YELLAMANDA REDDI — అధ్యక్షా! Presidents ను direct గా ఎన్నుకునే సిఫార్సులు ఏమయినా ఆలోచనలో వున్నవా?

The Hon Sri A B NAGESWARA RAO — అన్ని proposals అని చెప్పాను మళ్ళీ ఒకటికి ప్రత్యేకంగా ఏమీ లేదు దీంట్లో

Sri P NARASIMHAPPA RAO — అధ్యక్షా! కొన్ని తాలూకాలలో మొత్తం 20, 25 పంచాయతీబోర్డులున్నాయి చాలా పెద్ద villages వుండిపోయినాయి వాటిమాట యీ మూడుమాసాలలో ఎలాచేయడానికి వుద్దేశం వున్నదని అడుగుతున్నాను

The Hon Sri A B NAGESWARA RAO — ఇక్కడ ప్రభుత్వానికి తెలుసును కొలిసీ ఆలోచన లో వున్నదని చెప్పారు ఇంకా 6 నెలలు time వున్నది

*Nandikonda Project*

376—

* 659 Q —Sri B RATHNASABHAPATHI Will the Hon the Deputy Chief Minister be pleased to lay on the Table of the House the papers dealing with the correspondence that took place between the Planning Commission and the State on the Nandikonda Project which has led to the acceptance of the terms, financial, etc ?

The Hon Sri N SANJEEVA REDDI ,— The gist of the correspondence is already given in para 3 of the Governor s address dated 23-4-1955 and the Government consider it not desirable to place the correspondence on the table of the house on administrative grounds

Sri B RATNASABHAPATHI — ఐనా Constitution మొదలు పెట్టారు కనుక మీకు ఇవ్వడానికు objection వుండాలో తెలుపగలరా ?

The Hon Sri N SANJEEVA REDDI - Constitution మొదలయింది కాబట్టి correspondence మీకు ఏమిపనికివస్తుందో చెప్పండి

Sri B RATNASABHAPATHI —ఆ correspondence కు బంజరు భూములకు సంబంధం వున్నది కనుక ఆవిషయం తెలుసుకోవాలని ఉత్సాహంగావున్నారు కనుక ఆ వివరాలన్న తెలుపగలరా ?

The Hon Sri N SANJEEVA REDDI ఈ బంజరు sale proceeds project లో estimate లో తీసుకున్నారు కాబట్టి బంజరుభూములన్నీ కూడా సరైన ధరకట్టి వాళ్ళకే యివ్వాలన్న condition కు ప్రభుత్వంఒప్పుకుంది ఆ షరతున్నందువారలనే ఈ project sanction చేయబడింది

Sri PILLALAMARRI VENKATESWARLU — ఈ మంత్రివర్గానికి technical గా అభ్యంతరం లేకపోయినంటే, confidence reveal అయితే తల క్రిందులు కాకటువంటి information సభ్యులముందు పెట్టడానికి అభ్యంతరంవున్నదా?

The Hon Sri N SANJEEVA REDDI —కాని అనవసరంగా వున్న వన్నీ బయటపెట్టడం అంత మంచిదికాదు Project వచ్చేసింది కాబట్టి యిప్పుడు అవసరంలేదుమీకు Project conditions ఏవో ఒకటి రెండుచెప్పాము గవర్నరుగారి speech లో మిగిలినవన్నీ ఎన్నిసారులు వ్రాసినది ఎప్పుడు వ్రాసినది యివన్నీ కూడా తెలుసుకోవలసిన అవసరములేదేమోఅనుకుంటున్నాను, కాబట్టి ప్రభుత్వం పనిని సాధించుకున్నతరువాత బయటపెట్టడం మంచిదికాదని అభిప్రాయపడుతున్నాను.

Sri P BASI REDDI — ఈ నందికొండ project కేంద్రప్రభుత్వము sanction చేసిన సందర్భంలో యీ ప్రభుత్వం మామూలుగా వసూలుచేసే Revenue యిచ్చామని షరతు యిచ్చినారాండీ !

The Hon Sri N SANJEEVA REDDI — చాలా వుంటాయి దీంట్లో ఇప్పుడు నందికొండ ప్రాజెక్టు కట్టడంవల్ల ఎన్ని లక్షల ఎకరాలున్నాయో అన్ని లక్షల ఎకరాల ఖరీదు ఎకరం 200 రూపాయలు అందాజాగా వేస్తే ఇన్ని కోట్ల రూపాయలు వస్తాయి, ఎన్ని యింత వస్తుంది అని యివన్నీ estimatesలో వుంటాయి తక్కువగా పడకుండా చూచుకుంటాంగని హామీ మేము వారికి యిచ్చినాము

Sri PILLALAMARRI VENKATESWARLU — ఈ షరతులు అన్నీ గూడా కేంద్ర ప్రభుత్వం పెట్టింది కనుక పూర్తిగా దీనిని కట్టేటటువంటి బాధ్యత దీనికి అయ్యేటటువంటి డబ్బు కేంద్ర ప్రభుత్వం పెట్టుకోవాలని మంత్రివర్గం కోరుతుందా ?

The Hon Sri N SANJEEVA REDDI — ఖర్చంతా అప్పురూపంగా వారే యిస్తారు ఎటుఅయినా అది recoverable అయివుంటే amount ఎప్పుడయినా ప్రజలే pay చెయ్యాలి దానివల్ల పెద్ద లాభంగాని నష్టంగాని లేదు

Sri VAVILALA GOPALAKRISHNAYYA — ఈ correspondence లో యింత వరకూ బయటపెట్టండి ఆయకట్టుకు సంబంధించి difference of opinion చాలా వున్నాయి ఆయకట్టుకు సంబంధించినవి బయటపెడతారాండీ ?

The Hon Sri N SANJEEVA REDDI — ఆయకట్టుకు సంబంధించిన differenceలు చాలా సార్వత్రికంగా యిక్కడనే వుంటాయి దానిమీద controversy అవసరంలేదు Let us get along with the project first

Sri G YELLAMANDA REDDI — అధ్యక్షా ! ఈ project 2 దశలలో అని చెప్పారు దానిని యిదివరకే కనుక్కొని చెప్పాను నీటిపారుదల అని చెప్పారు కాని financial గా అంతా ఒకేసారి కేంద్ర ప్రభుత్వం ప్రయత్నిస్తుందాండీ ?

The Hon Sri N SANJEEVA REDDI — Second Five Year Plan కు సంబంధించి సంతవరకు first aspect అన్నారు దానికి కావలసిన డబ్బు మాత్రమే యీ ప్లాను కేటాయించారు Third five year plan కు కావలసినది తరువాత కేటాయిస్తారు ఈ second five year plan లో total amount కేటాయించడం జరుగదు

*Paint Factory and a Lithophone Plant*

877—

*1001 Q — Sri MAHAMMAD RAHMATHULLA — Will the Hon the Minister for Planning and Industries be pleased to

state whether there are proposals to start a paint factory and a lithophone plant and if so when ?

The Hon Sri K VENKATA RAO —

No, Sir

*II Message from the Governor*

Mr SPEAKER — I have to announce to the House that the following message dated the 1st August 1955 has been received from the Governor of Andhra —

"In pursuance of Article 207, Clause (1) of the Constitution of India, I, Chandulal Madhavlal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Andhra Legislative Assembly of the Andhra Appropriation Bill, 1955, and in pursuance of Clause (3) of the said Article, I also recommend to that Assembly the consideration of the said Bill"

## III GOVERNMENT BILL

*The Andhra Appropriation Bill 1955*

The Hon Sri B GOPALA REDDI — Mr Speaker, Sir, I beg to introduce the Andhra Appropriation Bill, 1955 and I move that the Bill be taken into consideration

Mr SPEAKER — I shall now put the question to the vote of the House and discussion on the Bill will take place at the next stage, that is the discussion of the clauses, as the matter has been sufficiently discussed already The question is

That the Andhra Appropriation Bill, 1955 be taken into consideration at once

The motion was carried

Mr SPEAKER — Now we go to the next stage, viz discussion of the clauses The Hon Minister will move his motion

*Clause 2*

The Hon Sri B GOPALA REDDI — Sir, I move

That clause 2 do form part of the Bill,

Sri P SUNDARAYYA — May I know when we are to have the general discussion of the Bill ?

Mr SPEAKER — We have already discussed the items in the Bill at great length Why should there be another discussion now Hon Members may speak at the clause stage

The Hon Sri B GOPALA REDDI — Mr Sundarayya, when I move that the schedule do form part of the Bill, you can speak on the entire Bill

Sri VAVILALA GOPALAKRISHNAYYA — General discussion ఇంకా ముందే జరగాలి ఇప్పుడు General Discussion తీసుకోలేదంటే clause వారీ అయినతర్వాత 3rd reading వచ్చినప్పుడు మాత్రము General Discussion చేయడానికి అప్పుడు అవకాశమివ్వాలి first న ఇవ్వలేదు కనుక

Mr SPEAKER — It is nothing new Why should there be overlapping Let us have one discussion Sri D V Subba Rao will initiate the debate The motion is Clause 2 do form part in the Bill

Sri D V SUBBA RAO — అధ్యక్షా ! యీ సభవారు లోగడ అనేక demands పైన grant చేసిన మొత్తాలను appropriate Act క్రింద pass చేయవలసిందని ముఖ్యమంత్రిగారు యీవేళ బిల్లు introduce చేసినారు ఐతే దీనిని Act క్రింద pass చేయడానికి ప్రతిపక్షముతరుపున అనేకమైన అభ్యంతరాలున్నాయి కారణమేమిటంటే ఇప్పుడు మనలను పరిపాలించుచున్నగి కాంగ్రెసు మంత్రివర్గము కాంగ్రెసు మొదటినుంచీ అందులో క్రొత్తగా యీమధ్యన అవడి కాంగ్రెస్ తీర్మానము pass ఐనప్పటినుంచి Socialist Pattern of Society నిర్మాణము చేయడముకోసము అనిచెప్పి దానికి కావలసిన సాధనవిధానాలన్ని అవలంభించుచున్నామని చెప్పుతున్నారు కాని ఇప్పుడు మన కళా వెంకట్రావుగారు ప్రతిపాదించినటువంటి యీ Draft plan లో గాని ఇతరవిషయాలలోగాని మంత్రివర్గముయొక్క వైఖరిలో ఎక్కడకూడా యీ సోషలిస్టుసమాజ నిర్మాణమునకు కావలసిన పునాదిరాళ్ళు ఎక్కడకూడా కనపడకుండా వున్నాయి ఐనప్పటికీ రోజులు మారాయనే సంగతి కనిపెట్టి బూజుపట్టిన సిద్ధాంతాలను పట్టుకొని ప్రేలాడుతూవుంటారు Socialists, Communists అనిచెప్పి కాంగ్రెసువారు నిన్నటివరకూ ఆక్షేపిస్తూకూడా యీరోజులు మారాయనేకారణమువల్లనే Socialist Pattern of Society ని నిర్మాణము చేయడమే మా ఆశయమని కూడా వారు ప్రకటనమాత్రము మార్చారని మనకు స్పష్టమౌతున్నది ఐతే యీ socialist సమాజాన్ని నిర్మాణము చేయడానికి కావలసినపునాది ఏమైనావుందా అంటే పునాదిరాళ్ళు లేవుకాని యీ సౌధాన్ని నిర్మాణముచేయడానికి అక్కడ సమాజము చిన్నబింపకుండా చంపి చేయడానికి మాత్రము సమాధిరాళ్ళు కనబడుతున్నాయి.

5th August 1955] (Sri D V Subba Rao)

అందువల్ల యీ బిల్లు Act క్రింద pass చేయడానికి నాకు తీవ్రమైన అభ్యంతరము వుంది ప్రధాన విషయము తీసుకోండి సామ్యవాద వ్యవస్థ నిర్మాణము చేయడానికి ప్రధాన ప్రాతిపదిక భూసంస్కరణ అనేది అందరు రాజకీయ వేత్తలు ఒప్పుకున్న విషయమే కాంగ్రెస్‌లోనే గాంధీగారి ప్రధాన శిష్యులని చెప్పి పేరుపడ్డ వినోభా భావే లాంటివారుకూడా యీ భూసంస్కరణ అనేది అత్యంత ప్రధానమైన సమస్య, దానిని ఎంత సత్వరంగా శాంతి పరిస్థితులలోనే పరిష్కరించితే అంతమంచిది లేకపోతే కమ్యూనిస్టు లాంటి విప్లవకరమైన ఉద్యమము దేశాన్ని కుదిపి పెట్టగలిగే పోవచ్చునని చెప్పి కాంగ్రెస్ వారికి హితవిస్తున్నారు A I C C Meetings లో ఇతర కాంగ్రెసు సభలలో కూడా వినోబా భావేగారి భూదానానికి యీ భూపంపక విధానానికి కాంగ్రెసువారు అందరూ చేయూత యివ్వవలసిందని చెప్పి ప్రధాన మంత్రి నెహ్రూ గారు కూడా ఎన్నోసార్లు A I C C Conference లో బోధ చేసినారు పోనీ సాధనలోను వాదాలలోను లేదా ప్రస్తుతానికి భూసంస్కరణ మార్గము అత్యంత ప్రధానమైన విషయమని అందరు ఏకగ్రీవముగా ఒప్పుకున్నదే ఐతే కాంగ్రెసువారు ఏమి చెప్పుతున్నారు? Land Reforms ను గురించి ఒక కమిటీ వేశాము అది వచ్చిన తరువాత ఏమో చూడవచ్చు ని ఐనప్పుడు రైతులను తొలగించి వుండడానికి Act తీసుకరారు ఈ రాష్ట్రములలో రైతులను తొలగించి వేస్తున్నారనే సంగతి నాకు తెలిసినప్పటినుండి నాకు చాల బాధగా వుంది కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాలు యీ విషయమును గుర్తించి సత్వరముగా తగిన శాసనాలు చేస్తారని నేను ఆశిస్తున్నానని నెహ్రూగారు ప్రకటన యిచ్చినప్పటికీ మన రాష్ట్ర ప్రభుత్వము మాత్రము యీ విషయము పట్టించుకోకుండా వుండడము చాల శోచనీయమైన విషయము బొంబాయిలో వుండండి చాలా కాలము క్రిందటే Interim Tenants Protection Act pass ఐంది హైదరాబాద్‌లో అది నిన్నటివరకు కూడా Feudal విధానములో పాలింపబడిన సంస్థానమైనప్పటికీ అక్కడ కూడా ఆ Act pass అయింది మొన్నటి వరకు మనతో సహచరులుగా వున్నటువంటి మద్రాసులో కూడా యీ Tenants కు eviction లేకుండా వేరే శాసనము తీసుకువస్తూనే వున్నారు మన ప్రభుత్వాన్ని గనుక అడిగితే ఏమంటుందంటే Land Reforms Committee వుంది కదా దాని proposals కొరకు కనిపెట్టుకున్నాము అదివచ్చిన తర్వాత సమగ్రమైన భూసంస్కరణల విధానము అవలంభిస్తాము తొందర పడకండి అని చెప్పుతున్నారు Tenants కు eviction లేకుండా చేయవలసిందని చెప్పితే ఆ ముక్క చెప్పుతుంది మన మంత్రివర్గములో వున్నవారు బహుశా lawyers ఎవరు లేరు అనుకుంటాను శ్రీ సంజీవయ్యగారు వున్నా practice మానివేశారు చంద్రమౌళిగారు బారిష్టర్ అని తెలుసును ఐతే practice చేస్తున్నవారు కాదు ప్రస్తుతము practice చేస్తున్నవాళ్లు కాదు కాబట్టి ఇప్పటిలో ఏమి జరుగుతుందో తెలియదనుకుంటాను Criminal courts లో వుండేవి Prohibition Cases Civil లో వున్నవి అన్ని Evictment suits యున్న దేశములో వుండే చిక్కును వాళ్లు కనిపెట్టినట్లు లేదు ఐతే మిగతా రాష్ట్రాలలో యింత సత్వరముగా నెహ్రూగారి మాట పాటించి అక్కడ వాళ్లు ఏ కారణముచేతనో అటువంటి శాసనము pass చేసివుంటే మన మంత్రివర్గము మాత్రము అటువంటి శాసనము తీసుకు రావడానికి యింత జాగు చేయడానికి కారణమేమిటో కనబడలేదు,

Land reforms వచ్చినప్పుడు చేస్తామంటే యీ tenants విషయములో మాత్రమే ఇనాము tenants కు శాశ్వతం పెట్టుతారని చెప్పి వదంతిగావుంది ఇదైనా ఎంత మాత్రము దీని కనుక పోరుండేనా తెలియదు కాని జిరాయితీ అన్నిరకాల Tenants విషయములో కూడా eviction లేకుండా శాసనము pass చేయడానికి అభ్యంతర మేమిటి? ఐతే మంత్రివర్గముయొక్క వైఖరి సూచన ప్రాయముగా లోగడ Revenue మంత్రిగారు అక్కడక్కడ ఉపన్యాసాలలో వివరించిన మాటలను బట్టి అర్థము చేసుకోవాలి దున్నేవానికే భూమి అనే సూత్రము కాంగ్రెసు అంగీకరించిన ప్రధాన ప్రాతిపదికలలో ఒకటి యీ మధ్యన రివెన్యూ మినిష్టర్ గారు అక్కడక్కడ ఉపన్యాసాలలో దున్నేవానికే భూమి అనే నినాదము అర్థరహితమైన నినాదమని చాలసార్లు నొక్కి చెప్పారు

దాన్నిబట్టి కాంగ్రెస్ అంగీకరించినటువంటి ప్రధాన ప్రాతిపదిక సూత్రాలకే తిలోదకాలు ఇచ్చినట్టుగా కనబడుతోంది అది మంత్రివర్గంవారియొక్క అభిప్రాయమైనట్లయితే ఇప్పుడు చేసుకొన్నది రైటేనన్నమాట అందువల్ల ఇటువంటివాటిని బట్టి మనకు ఏమని అనుమానం కలుగుతోందంటే సరియైనటువంటి భూసంస్కరణ శాసనాలు ఈ మంత్రివర్గం త్వరలో తీసుకువస్తుందని అనుకోడానికి వీలులేదు రైతులయొక్క తొలగింపును గురించి శాసనం తీసుకురమ్మంటే ఇప్పుడు నేను చెప్పినట్లుగానే భూసంస్కరణల కమిటీ యొకటి ఉందిగదా, దాని report చూద్దామని తరువాత చేయవచ్చునుగదా అంటారు అలా ఐనట్లయితే తీరువాయిల హెచ్చింపును మన గోపాలరెడ్డిగారు బిల్లుపెట్టారుగదా ఈ తీరువాయిల హెచ్చింపు సమస్యకూడా భూసంస్కరణకమిటీ report వచ్చినతరువాతనే ఎందుకు ఆలోచించకూడదు బంజర్లు అమ్ముతామంటున్నారే ఇదికూడా భూసంస్కరణకు సంబంధించినదేకదా ఆ సంస్కరణ కమిటీ report వచ్చినతరువాతనే ఎందుకు ఆలోచించకూడదు దీన్ని అంతవరకూ ఎందుకు ఆపుచేసి యుంచకూడదు ఐతే ఒకముక్క అంటున్నారు

The Hon Sri B GOPALA REDDI — ఆ కమిటీయొక్క terms of reference లో ఈ question లేదు

Sri D V SUBBA RAO — దానిలో లేకపోతే పోనియ్యండి ఇది భూసంస్కరణలకు సంబంధించిన వ్యవహారమేగదా పేదవాడికి భూమి ఇవ్వాలి దున్నుకునేవాడికి భూమి ఇవ్వాలి అనేది ఈ భూసంస్కరణ సమస్యలో అంతర్భాగమేకదా? ఆవిషయంలో ఎందుకు వేచిఉండకూడదు అంటే భూములు పేదలకు ఉచితంగా ఇవ్వడం మానేసి అమ్మడం ఏమిటయ్యా అంటే దానికి మంత్రివర్గంవారు చెప్పేది ఏమిటంటే, project affected areas లో అమ్మకపోతే ఎట్లాగ? Projects కు కోట్లకొలదీ ధనం గవర్నమెంటు ఖర్చుపెడుతోందిగదా, అందుకోసం కొంత డబ్బు రాబట్టడానికని అంటున్నారు ఐతే ఎంతఖరీదుకు అమ్ముతారయ్యా అంటే, nominal price కే అమ్ముతామని సాకు చెబుతున్నారు Nominal price కే అమ్మినట్లయితే కోట్లకొలదీ ఖర్చుపెట్టే డబ్బులో ఎన్నోవంతు వస్తుందన్నమాట Nominal గానే, negligible amount వస్తుంది అందుచేత అంత తక్కువ amount కు అమ్మనే అక్కరలేదు ఉచితంగా పంపిణీచేయవచ్చు లేదా substantial value కే సరియైన

ఖరీదుకే అమ్ముతామంటూరా ఐతే పేదలకు ఉచితంగా ఇస్తామని ప్రతి అభ్యర్థి అన్నమాట అంటే కాంగ్రెసువారు చెప్పేమాటలలోనే ఈ అంతర్వైరుధ్యం, స్వవచన వ్యాఘాతం స్పష్టంగా కనబడుతూనేయుంది ఇటువంటి సాకులు అర్థరహితంగా చెప్పి భూసంస్కరణలు వెనకపెట్టడమే వారి వైఖరిగా కనబడుతోంది కాబట్టి ఈ ప్రధానవిషయంలో యీ మంత్రివర్గంయొక్క వైఖరి చాలా లోపభూయిష్టంగా ఉంది కాబట్టి, ఎప్పుడో భూసంస్కరణలు వచ్చినతరువాత చూస్తామని ప్రతి చిన్నవిషయం వెనకపెట్టెయ్యడం ఎంతవరకంటే కష్టినవాడి గాది తినేటప్పటికి లేనివాడి ప్రాణం లేచిపోయినట్లుంది ఈలోపు చాలామంది ఇబ్బందిపడుతున్నారు అందుచేత ఇటువంటి ప్రధాన విషయములో వీరి బాగువైఖరి చూచినట్లయితే మనం ఈ బిల్లును ఆమోదించడానికి వీలులేదని చెప్పవలసివస్తుంది ఆ విషయంలోనే కాదు ఇప్పుడు దారుణమైన వడ్డీ రేటునుగురించిన సమస్య ఉంది ఏదో రాజగోపాలాచారిగారు scaling down not pass చేశారుగదా అంటే ఒకటి అలా ఉంచండి కాని ఋణదాతలు దారుణమైన వడ్డీ రేట్లు అంతా కలిసి, అసలులోనే కలిపి ప్రోనోటు వ్రాయించేసుకుని మోసపుచ్చుతున్నారు ఏవిధానాన్ని మీరు వడ్డీరేటు తగ్గించాలనుకున్నప్పటికీ ఈ శాసనంవల్ల, ఏమీ ప్రయోజనం లేకుండాపోయింది ఎన్ని శాసనాలు pass చేసినప్పటికీ అనేకవిధాలుగా వడ్డీ వారికి వచ్చేటట్లు వేసుకుంటూనే ఉన్నారు అందువల్ల ఈ గవర్నమెంటు Co operative Societies ద్వారానే నామమాత్రంగా పేదప్రజానీకానికి ఋణాలు అందేటట్లు ఎందుచేత చేయకూడదు ఇప్పుడు Rural credit Survey report Table మీద ఉన్నదని చెప్పారు అది చదివినట్లైతే నామమాత్రంగా Co operative Societies ద్వారా పేదప్రజలకు 2% మట్టుకే loan అందుతోందని అందులో ఉంది ఈ Co operative Societies ద్వారా ఇంకా ఎక్కువగా ఋణాలు పేదప్రజలకు అందేటట్లు చూస్తే వారు ఈ జలగలవలె పీల్చుకునే ఋణదాతల చేతులలోపడి, ఆర్థిక దాస్యానికి గురికాకుండా వారు బైటపడతారు ఆ విషయంలో ఈ plan లో ఏమీ చెప్పబడియుండలేదు తరువాత Judiciary విషయంలోనూ, jails reform విషయంలోనూ అసలు discussion లేకుండా చేశారు కొన్ని jails చూచినట్లైతే బోధపడుతుంది ఐతే ఇప్పుడు మనం అధికారంలో ఉన్నాంగదా ఇంక jail కి మనం వెళ్ళవలసిన పనేంలేదని కాంగ్రెసువారి అభిప్రాయమేమో కిందటేళ్ళక్రితం గవర్నమెంటువారు jail reforms ను గురించి suggestions పంపించమని Jail Superintendents కు circular పంపించడం నాకు తెలుసును ఇప్పుడున్న కొన్ని jails చూచినట్లైతే రాత్రిమాట అలా ఉంచండి, పగలు వెళ్ళి చూస్తేకూడా ఆ cells లో యున్న మనుష్యులు మనకు కనపడరు మనం గుడ్లగూబకళ్ళు పెట్టుకుని వెళ్ళి చూడాలిగాని, మనిషికళ్ళకు ఎక్కడా కనపడరు ఈ మధ్యన T D Cinema లు ఏవో వచ్చాయి చూశామా Special glasses పెట్టుకుచూడాలట అటువంటికళ్ళు ఏమైనా పెట్టుకుచూడాలిగాని ఆ చీకటికొట్లలో యున్న మనుష్యులు పగలు చూచినా కనపడరు ఇటువంటి jails reform చెయ్యాలనే సూచన ఏమీ లో కనపడదు ఇంక living wages విషయంలోకూడా, పంచభక్ష్యపరమాన్నాలతో భోజనం అక్కర్లేదు కనీసం జీవనవ్యయప్రమాణానికి సరిపడిన కూలిఐనా ఇస్తామని గ్యారంటీ లేకపోవడంలో అర్థమేమిటండి ఏదో పెద్దసౌధాలు నిర్మించేస్తున్నాం ప్రపంచంలో ఎక్కడాలేని పద్ధతులలో national planning అత్యద్భుతంగా చేస్తున్నామని అతిశయోక్తిగా చెప్పుకునేందుకు

ఈ కోరినట్టి ప్రయోజనాలైనా 1960 కి కాదు, 1970 నాటికైనా నెరవేరుస్తామనే సూచనలు ఏమీ లేని సందర్భంలో ఈ బిల్లును act గా pass చెయ్యడానికి ప్రతిపక్షం తరపున అంగీకరించడానికి వీలు లేదని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri N P CHENGALRAYA NAIDU — అధ్యక్షా ! మన నూతన మంత్రివర్గం ఏర్పాటైన తరువాత ఈ మొట్టమొదటి బడ్జెటు సమావేశములో అందరూ కూడా పద్దులన్నీ బలపరిచారు పద్దులన్నీ కూడా పాసయినాయి ఎదురు పక్షములో ఉండేవారు మాత్రము ప్రతిదానికీ ఆక్షేపణలు మాత్రము చేస్తున్నారు అందుకు ముఖ్యంగా విచారించవలసివస్తోంది ఇక్కడ ఈ కొద్ది డబ్బుకు మన రాష్ట్రములో బడ్జెటులో లోటుగా ఉన్నది మన రాష్ట్రం కొత్తగా ఏర్పడిన కారణంచేత ఖర్చులు అధికంగా ఉంటాయి ఉండే డబ్బుతో అన్ని పద్దులకూ కూడా సక్రమంగా కావలసిన డబ్బును కేటాయించినారు అంతకంటె అధికంగా డబ్బు ఉంటె ఇంకా కావలసిన పనులు అనేకం చేసుకోవచ్చును గాని ఉండే డబ్బుతో అధికంగా ఇంకా పనులు చేయలేదని ఆక్షేపించుట మాత్రం న్యాయం కాదని నేను మనవి చేస్తున్నాను ముఖ్యంగా ప్రతిపక్షమువారే ఈ బడ్జెటు ఏర్పాటు చేసేందుకు పూనుకుంటె ఇంతకంటె అధ్వాన్నంగానే ఉంటుందని మనం అనుకోవచ్చును ఇక్కడ ప్రతి దానికి ఆక్షేపణే ముఖ్యంగా పెట్టుకొంటె లాభంలేదు మనం జరుగవలసిన పనులన్నీ కూడా చేసుకోవాలి మన సూచనలేమైనా ఉంటె మాత్రం ఇవ్వవలసిందని నేను మనవి చేస్తున్నాను ప్రభుత్వమువారికి ముఖ్యంగా కొన్ని సూచనలు మాత్రం చేయాలని అనుకుంటున్నాను ఇప్పుడు project లన్నీ కూడా కడుతున్నారు Project లలో ఒక సంవత్సరంలోపున ఏదైనా పనిపూర్తి కావాలని estimate వేసినప్పుడు ఆ సంవత్సరం వరకూ అక్కడ సిబ్బందికి కావలసిన డబ్బంతా కూడా ఆ estimate లో వేస్తారు సంవత్సరం లోపల పని పూర్తికాకుండా మరల ఆరు మాసాలో సంవత్సరమో పొడిగించేలా యుంటె మళ్ళీ ఈ estimates revise చేయవలసి వస్తుంది అధికంగా ఖర్చుకూడా వస్తుంది అందువల్ల సాధ్యమైనంత వరకూ ప్రభుత్వము ఈ revised estimates రాకుండా అనుకున్న కాలంలోనే ఈ project పనులుగాని, మరి ఏ కట్టడాల పనులుగాని పూర్తి చేయవలసిందని వారికి మనవి చేస్తున్నాను ఇక department నుంచి మన శాసన సభ్యులకు గాని మిగతా వారికి గాని ప్రభుత్వంవారు report లు ఇస్తున్నారు ఈ report లు, ఆ department report లు అన్నీకూడా సక్రమంగా సకాలంలో అందేటట్లు ఇస్తే మనం చదువుకొనేందుకు, దాన్ని గురించి ఆలోచించేందుకూ కూడా వీలుంటుంది ఈ బంజరు భూముల పంపిణీ విషయంలో రాష్ట్రంలో ఎక్కడ చూచినా చాలా ఆందోళన ఉంది ఇక్కడ శాసనసభలో కూడా అందరూ ఈ బంజరు భూముల పంపకాన్ని గురించి అనేక సూచనలు చేస్తున్నారు దీని విషయంలో ఇంకా నిదానించేందువల్ల ఇబ్బందులు అధికమవుతున్నాయి అందువల్ల ప్రభుత్వంవారు ఈ బంజరు భూములనన్నిటినీ సక్రమంగా పంపిణీచేసి, ఆ పంపిణీ చేసేటప్పుడు కూడా ఎవరైతే భూమి లేకుండా ఉన్నారో, అటువంటివారికి ఆభూమి పంపిణీచేస్తే బాగుంటుందని సూచిస్తున్నాను ఈ Food Production Department అని ఒకటి ఉన్నది దాన్ని P W D. లోనో, లేకపోతే minor irrigation లోనో కలిపివేస్తే బాగుంటుందని వారికి మనవిచేస్తున్నాను ఈ department లు అధికమైనకొలదీ ఖర్చు అధికమౌతుంది

కాని పనులు అనుకున్నంత శీఘ్రంగా కాని, అంత చురుకుగా కాని జరగడంలేదు అందువల్ల ఈ Food Production Department ను రద్దుచేసి minor irrigation P W D ఈ రెండే మాత్రం ఉండేటట్లుగా ఏర్పాటుచేయాలని వారికి మనవిచేస్తున్నాను ఇంకొక చిత్తూరుజిల్లాలో Palar Basin కి rules కొన్ని ఉన్నాయి ఈ Palar Basin rules ఉన్నప్పుడు మదరాసు రాష్ట్రములో వారికి అనుకూలంగా ఉండేటట్లు ఆ దక్షిణ జిల్లాలలో వారికి ఈ నీరంతా కూడా పోయేందుకు వారు ఏర్పాటుచేసిన rules అవి ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం ఏర్పడినందువల్లకూడా చిత్తూరుజిల్లావారు ఇంకా కష్టపడాలనే అభిప్రాయం లేకుండా మన ప్రభుత్వం rules amend చేసి చిత్తూరుజిల్లా ప్రజలకు ఈ నీటివసతులవిషయంలో సౌకర్యాలు కలుగజేయాలని కోరుతున్నాను ఇక క్రొత్త tax ల విషయం ఇప్పటి స్థితిలో అన్నివస్తువిషయంలోకూడా ఉండే దక్షక్రమంగానే ఖర్చుపెట్టేందుకు వారు పూనుకున్నారు దానికి వారిని అభినందించవలసినదే పోతే మనకు ఈ డబ్బు చాలదు, ఇంకా అధికంగా పనులు కావలసియున్నవి అందువల్ల మనం అధికంగాకూడా డబ్బు ఖర్చుపెట్టాలి అందుకు ప్రజలవద్దనుంచి అధికంగా tax లు రాబట్టవలసియుంటుంది

అధికంగా క్రొత్త పన్నులు వేయవద్దని ఎవరూ చెప్పరు అయితే క్రొత్త పన్నులు వేసేటప్పుడు, ఎవరికైతే కట్టేందుకు శక్తి ఉన్నదో వారికే వేయవలసిందని ముఖ్యంగా మంత్రివర్గానికి మనవి చేస్తున్నాను ఇప్పుడు రైతులమీద wet ayacut పైన పన్ను, నీటి తీరువ పన్ను వేస్తామని ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు అది రైతులలో చాలా ఆందోళన కలిగించింది ఇది కొంతవరకు రైతులకు చాలా అన్యాయంగా తగులుచున్నది కొందరు తుంగభద్ర Low Level Channel క్రింద ఎకరాకు 15 రూపాయలు కూడ కడుతున్నారు చిత్తూరు జిల్లాలో ఎకరాకు 12 రూపాయలు కడుతున్నారు అక్కడ ఏమి ప్రాజెక్టులు లేవు వర్షము వస్తే చెరువులకు నీరు వస్తుంది, లేకుంటే లేదు అటువంటి చోట్లకూడ ఈ పన్ను వేయడం చాలా అన్యాయంగా ఉంటుంది కనుక క్రొత్త బిల్లు ప్రవేశపెట్టేలోగా ఇటువంటి పరిస్థితులన్నీ చూచి మరొకసారి దీనిని పరిశీలించి రైతులకు ఇబ్బంది కలగకుండా, సాధ్యమైనంతవరకు ఇవన్నీ తగ్గించి తగిన మార్పులతో క్రొత్త బిల్లు ప్రవేశపెట్టవలెనని మంత్రివర్గమునకు మనవి చేస్తున్నాను ఈ విధంగా చేస్తామని ఈ దినమే మంత్రిగారు ఒక statement ఇస్తే బాగుంటుంది ఈ రెండు బిల్లులు enforce చేయబోతామని వారు ఇంతకు ముందు ఒక statement ఇచ్చినందువల్ల అది రైతులలో చాలా ఆందోళన కలుగజేసింది, అందుచేత రైతులకు ఇబ్బంది కలుగకుండా వాటిలో తగిన మార్పులు చేస్తామని, ఇప్పుడు ఇంకొక statement ఇస్తే బాగుంటుంది

ఇక ఈ పనులకంతా డబ్బు చేర్చే ప్రభుత్వానికి సహాయం చేయవలెనని శ్రీ కళా వెంకటరావుగారు సెలవిచ్చారు ఆ విషయం కూడా యోచించవలసియున్నది ప్రజలవద్దనుంచి పన్నులు వసూలు చేసేటప్పుడు ఆ డబ్బు అంతాకూడ సక్రమంగా ఖర్చుచేయవలసినటువంటి బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నది వారు చెప్పినట్లు ఖర్చు తగ్గించుకోవలసిన బాధ్యతకూడ ప్రభుత్వముమీదనే ఉన్నది కాని ప్రభుత్వము ఇది సరిగా గుర్తించినట్లు లేదు. ఉదాహరణకు 13 మాసాలు పరిపాలించినటువంటి గత మంత్రివర్గమునకు ఇచ్చినటువంటి ఇండ్లన్నీ వారికి ఇచ్చినప్పుడు repair చేశారు. కాని

(Sri N P Chengalraya Naidu) [5th August 1955

ఈ మంత్రిగారు కట్టిన తరువాత మరల ఆ ఇండ్లన్నీ re model చేస్తున్నారు దానివల్ల ఖర్చు అధికంగా అవుతున్నది ఆ రీతి ఇళ్ళు re model చేసేందుకు ఖర్చుపెట్టే దానికంటె, క్రొత్త ఇళ్ళే కట్టుకొంటె బాగుంటుందని సూచిస్తున్నాను ఆదేవిధంగా ముందు ఉండిన కార్లు అన్నీ మూల త్రోసి క్రొత్త కార్లు కొన్నారు ఈ విధంగా అనవసరముగా డబ్బు ఖర్చు అవుతున్నది ఇటువంటి అనవసరపు ఖర్చులన్నీ తగ్గించుకోవచ్చును కనుక ఖర్చు తగ్గించుకొమ్మని ప్రజలు చెప్పేదానికంటె ముందు ప్రభుత్వమువారే ఖర్చులు తగ్గించుకొంటారని మనవిచేస్తున్నాను

Sri T N VENKATASUBBA REDDI — Sir, after these three weeks of discussion one thing that is impressed on my mind, as it would have on the entire House, is that while the Government is anxious and the Members of this House are agitated, about the various things that we should do for the people, which are urgent and expected by them, all these desires and expectation are limited by one factor and that is our financial resources Unfortunately, as I have already said, we have not even got a balanced budget, we have a budget with a deficit of nearly 4 0 crores I should have thought that the entire discussion in this House would have centred on that one aspect, how we are going to find resources that are necessary to implement the various demands made both from the Government Benches and the Opposition But I am afraid that no effort to this end has been made On the contrary there have been slight murmurs here and there of opposition to any measures of taxation that have been proposed by the Government I do not desire to say anything about taxation But I want to impress on the House that it is our urgent duty to find out the means by which we are going to find the resources, to give to the people various urgent requirements that we in this House are demanding from the Government and which the Government themselves are very anxious to do As this is very urgent we cannot lose any time in trying to find ways and means to get the financial resources The first thing that we will have to do is to see how we can make our budget at least a balanced budget We have now a deficit of Rs 4 0 crores and unless we can first make it balanced, I am afraid it will be impossible for any of us to suggest to the Government of any increase in the social services that we should give to the people In this connection I would humbly try to bring to the

notice of the Government only one or two possibilities that strike me to make up the deficit Of course one is the new taxation measures and it is no use our shirking the responsibility of raising fresh taxes from wherever possible with the idea that these funds are going to be spent for the welfare of the people It is the right of the Opposition to oppose the taxation measures But I as a member of the Government Benches do not want to shirk the responsibility because new taxes are required to give more amenities to the people After all we must realize that the Government is a co operative institution, an institution whereby we are trying to administer the various needs of the people from a centralised organization and to this end it is necessary that we decide and this House decides to find the means

Another point for reducing the deficit is retrenchment I understand that there are possibilities of retrenchment in Government expenditure The Hon Chief Minister the other day was mentioning that this aspect had been investigated some time back and it was found impossible I was going through the Ramalingam Chettiar Committee Report and I came to understand that if the recommendations of that committee were carried out, it would result in a saving of about Rs 5 0 crores, i e in the composite Madras State I cannot say that I have gone through this report in its entirety but it is a very conservative report, the report was prepared with the assistance of senior officers taking into consideration efficiently and various other aspectes that are involved in retrenchment, i e especially unemployment So far as our State is concerned, the saving might be about Rs 1 0 to Rs 2 0 crores I therefore humbly request the Government to re examine the question of retrenchment again and try to save expenditure as much as possible

If we go through the accounts for 1954 55 we find that there has been an increase in expenditure on general administration *to the extent of* Rs 85 0 *lakhs I must congratulate* the Hon Chief Minister that he has been able to reduce this by about Rs 26 0 lakhs this year But I would suggested to him that he might try to reduce the full increase of Rs 85 0 lakhs made in the year 1954 55 Retrenchment is possible if careful scrutiny is conducted and if the Government is treated as a

personal commercial undertaking In this connection I would request the Hon Chief Minister to consider the suggestion made by a few of us, the institution of an Estimates Committee would go a long way to control the wasteful expenditure in the estimates and execution of various schemes I would also request the Hon Chief Minister if possible to indicate his views on this matter Further, Sir I submit that we should make up our minds that on the one hand we should raise fresh taxation, and on the other hand try to minimise our expenditure as much as possible and see that we given these benefits that we have all demand to the people as soon as possible and in as great a measure as possible Thank you, Sir

Sri P GOPALAKRISHNA REDDI —అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రతిపాదించిన ఈ appropriation బిల్లును నేను బలపరుస్తూ నేను కొన్ని సూచనలను వారికి తెలియజేయ దలచుకున్నాను మొదటిది యేమిటంటే కొన్ని కోట్లరూపాయలు irrigation కు అయితే నేమి, రోడ్లకు అయితేనేమి యితరత్రా వాటికి అయితేనేమి ప్రభుత్వము ఖర్చు పెట్టుతున్నది ఇందులో చాలా లోపాలు వున్నవి అవి నా మనస్సుకు వస్తున్నవి ఇందులో ముఖ్యమయింది నిన్నటి దినము నిజంగా ఆలోచించినట్లైతే యిందులో లోపాలు వున్నవో, లేదో పరిశీలించి చూస్తే అవి అందరికి తెలిసియుండును ఇటువంటి పరిస్థితిలో యివి సక్రమంగా జరగటానికి ప్రభుత్వమే ఆలోచించి ఖర్చుచేయాలి ఇతర రాష్ట్రాలలో ప్రభుత్వము చేసిన ఖర్చులు సరియైనవి అవునా కాదా అనేది పరిశీలించటానికి ఒక Estimates Committee ని వేశారు అదేవిధంగా మన రాష్ట్రములో ప్రభుత్వము చేసిన ఖర్చులను పరిశీలించుటకు ఒక Estimates Committee ని వేస్తే అందులో వున్న సాధక బాధకాలు తప్పొప్పులు పరిశీలించుటకు యీ estimates లో ఎక్కువ తక్కువలు వున్నవా అనే విషయము నిర్ధారించుటకు Estimates Committee ని వేయటానికి ప్రభుత్వము అంగీకరించి వేస్తారని ఆశిస్తున్నాను

రెండవ విషయము యేమిటంటే మా నెల్లూరు జిల్లాలో Mica Mine owners వుంటున్నారు వీరు నూరు ఎకరాలు రెండు వందల ఎకరాలు నాలుగు వందలు ఎకరాలు యీ విధంగా Mica Mines అనే పేరుతో స్వాధీనములో వుంచుకున్నారు నిజానికి యీ భూమిలో ఏ 20 ఎకరాలో mica గనులకు గాను ఉపయోగించుకొని తక్కిన పొలం అంతా కూడా బీడుగా వుంచుకున్నారు ఈ విధంగా వుంటే ప్రభుత్వానికి చాలా నష్టము వస్తున్నది అందువల్ల వీరు mica గనులకు వుపయోగించే భూమి తప్ప తక్కిన భూమినంతను వేలము వేస్తే ప్రభుత్వానికి సుమారు సంవత్సరానికి ఏ 10 నుండి 50 లక్షల వరకూ income రావడానికి వీలు వుంటుంది ఏ Mica Mine Owners కు అయినను 50 ఎకరాల కంటె యివ్వకూడదు, అనే నిబంధన ఏర్పాటు చేయాలని కోరుతున్నాను కాబట్టి, యీ రెండు సూచనలను ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను, ప్రభుత్వము వీటిని ముఖ్యంగా గమనిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత సోమశిల ప్రాజెక్టు విషయము చాలముఖ్యమైనది దీన్ని గురించి ముఖ్య మంత్రిగారికి పూర్తిగా తెలును ఈ ప్రాజెక్టు నిర్మాణము త్వరలో అమలు జరిగేటట్టుగా ముఖ్యమంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను

Sri SHAIK MOULA SAHEB — అధ్యక్షా, ఈనాడు ప్రవేశపెట్టబడిన యీ ద్వితీయపంచవర్షప్రణాళిక మొదటిసారిగా ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత యిది వచ్చిందిగనుక యిది ద్వితీయ పంచవర్షప్రణాళిక అయినప్పటికీ మనకు దీన్ని ప్రథమ పంచవర్షప్రణాళిక అనే భావించాలి ఈ ప్రణాళికలో ముఖ్యంగా మనము ఎన్నో మనో, కలలుకననటువంటి కలలను మనము యీ ప్రణాళికలో చూస్తున్నాము

Mr SPEAKER — పంచవర్షప్రణాళికను గురించికాదు బడ్జెటును గురించి చెప్పండి

Sri SHAIK MOULA SAHEB — ఈ బడ్జెటులో యిచ్చిన irrigation స్కీములుగాని, నిర్ణయించిన పద్ధతులుగాని, అఖిలభారత కాంగ్రెసు ప్రెసిడెంటు దేబర్‌గారు సోషలిస్టు పంథాలో యిచ్చిన ఉపన్యాసాల దృష్ట్యా వాటికి ఏలాంటి సంబంధము లేకుండా తయారుచేసినట్లు వున్నది కారణం మేమంటంటే, 214 కోట్లరూపాయల ఖర్చుతో యీ ద్వితీయ పంచవర్షప్రణాళికను తయారుచేసినప్పుడు అది మనరాష్ట్రములో వున్న 108 నియోజకవర్గాలకును సరిసమానంగా ఉపయోగించేటట్టు ఉద్దేశించి తయారుచేసినప్పటికిని, మా నెల్లూరుజిల్లాలోని ఉదయగిరి తాలూకాకు అవసరమైన యేవిధమైన అభివృద్ధి స్కీములుకూడా అందులో కనబడదు మా ఉదయగిరితాలూకా చాలా వెనుకబడిన తాలూకా అని అందరికీని తెలుసు అక్కడ నిజానికి ఒక కోటి యాభైలక్షల రూపాయలవరకు ఖర్చుచేయవలసివున్నది అటువంటిది లేకుండా వుండటానికి కారణమేమి అని అడిగితే, మమ్మల్ని ఏమిచేయమంటారు? ఆ స్కీములన్నీ P W D వారు తయారుచేసిన స్కీములు అని జవాబు చెప్పవచ్చు కాదు వారు ఆవిధంగా చేసివుండరని నేను గట్టిగా చెప్పగలను మా నెల్లూరుజిల్లాలో Executive Engineers జిల్లాకలెక్టర్లు, జిల్లాలోవున్న శాసనసభ్యులు, పార్లమెంటుసభ్యులు, వీరందరూకూడా ఆ తాలూకా చాలా వెనుకబడిన తాలూకా గనుక అక్కడ ముందుగా ఏవీ అభివృద్ధి స్కీములు అమలుజరగాలనేది మేము కొన్ని స్కీములు వారికి సూచించాము ఆ విషయములో మా జిల్లాలోని నా నియోజకవర్గము యీ ఉదయగిరితాలూకాలో వుండడమువల్ల ప్లానింగుమంత్రి శ్రీ వెంకట్రావుగారు మా నియోజకవర్గములో ఏవేవి స్కీములు కావాలి అని కోరగా నేను తెలుగులో వ్రాస్తే, సరిగా అర్థముకాదేమోనని, వీటినన్నిటిని అచ్చువేయించి ప్లానింగుమంత్రిగారికి ఒక స్కీమును అందజేశాను ఆ స్కీమును జిల్లా Planning శాఖవారికి మొట్టమొదటగా అందజేసింది నేనే దాన్ని మా జిల్లాలోని ఆఫీసర్లు అందరుకూడా ఆమోదించి వారు యీ స్కీము తప్పనిసరిగా అమలుజరగాలని ఏకగ్రీవంగా తీర్మానించారు ఆ తీర్మానాన్ని మంత్రిగారికి చేరివుంటాయి అందులో కొత్తస్కీముయేది చెప్పలేదు మా తాలూకాలో వున్న గండిపాలెముచెరువు తెగినందున ఆయకట్టులోనినీరు చాలనందున గండి పూడ్చటానికి 75 లక్షలు ఖర్చుఅవుతుందని దీనికి యిదివరకే investigate చేసి estimates తయారుగా వున్నవి చెరువుకు నీటి సప్లయి చాలనందువల్ల బోడమంచ కాలువ కట్టి సూచించియున్నాము వీటికి యిదివరకే

2,50,000 రూపాయలకు ఏనాడో investigations చేసి estmates కూడా తయారుచేశారు యిటీవల ముఖ్యమంత్రిగారు ఉదయగిరి క్యాంపుకు వచ్చినప్పుడు Executive Engineers కూడా యీ గండిపాలెము చెరువుచూచి గండి బిగించటానికి మాత్రమే 75 లక్షలరూపాయలా అని అన్నారు ఈ చెరువు పూర్వకాలములో శ్రీకృష్ణదేవరాయలువారి కాలములో ఆ మహారాజు ఎంతసొమ్ము ఖర్చుపెట్టి యీ చెరువు కట్టించారోగాని యిక యీ చెరువుయొక్క ప్రాధాన్యత ఎంతవుంటుందో ఆలోచించాలి ఈ చెరువుక్రింద సుమారు 10 వేల యకరాలవరకూ నీరు పారుదల అవుతుంది అటువంటి చెరువుఅయినా మరమ్మతుచేసి, ఆ గండి బిగించకపోయినట్లయితే, అక్కడ యీ చెరువు మీద ఆధారపడి నివసించేవారు ఎంతో కష్టపడతారని ప్రభుత్వము గుర్తించాలి కాబట్టి యీ చెరువుకు ఒక చిన్న ప్రాజెక్టును నిర్మిస్తే, ఆ తాలూకాయొక్క దరిద్రము ప్రభుత్వమువారు పోగొట్టినవారవుతారు అందువల్ల యీ గండిపాలెము చెరువు, బోదవంద కాలవ, యీ రెండున్నూ తప్పకుండా చేయించుతామని ముఖ్యమంత్రిగారు అక్కడకు క్యాంపుకువచ్చి చూచి, చెప్పివచ్చారు కాని యిప్పటివరకూ అక్కడ ప్రాజెక్టులు కడుతున్నప్పటికినీ తెగిపోయిన చెరువులకు మరమ్మతులుఅయినా అంతోయింతో ఖర్చుపెట్టి చేయించడానికి యీ బడ్జెటులో ఎక్కడనూ చూపబడలేదు అందువల్ల యీ చెరువుకు మరమ్మతు చేస్తారనే ఆశకూడా మా నియోజకవర్గములోని ప్రజలకు లేకుండాపోయింది ఇప్పటికైనా నందికొండ ప్రాజెక్టు వస్తుంది, వస్తుందని, మా నియోజకవర్గములోని ప్రజలు ఎంతోకాలంగా ఆశిస్తున్నారు ఈనాడు నందికొండ ప్రాజెక్టునుంచి low level channel ఒకటి తీసుకొనిపోతున్నారు ఆ low level channel ఒకటి తీసుకొని పోతున్నారు ఆ low level channel ఏప్రాంతముగోగుండా తీసుకొనిపోయినప్పటికిని, దానికి ప్రథమదశలోనే గుంటూరుజిల్లాతోబాటు, కాలువలుఅయినా నెల్లూరుజిల్లాలో త్రవ్విస్తే ముందుముందైనా నీరువస్తుందనే ఆశవుంటుంది కాని యిప్పుడు ప్రభుత్వమువారు చేసేపద్ధతి అంతా చూస్తే, యీ కాలవ నామమాత్రంగా వున్నట్లు కనబడుతున్నది కారణమేమిటంటే, Low level Channel ద్వారా వచ్చే నీరు అక్కడే గుంటూరుజిల్లాలోనే సరిపోతుంది యిక మా నెల్లూరుజిల్లావరకు వస్తుందో రాదో అని అంటున్నారు ఇక యీ తుంగభద్ర హైలెవెల్ ఛానల్ విషయముచూస్తే దానికి ఆటంకాలు వస్తున్నవని వింటున్నాము ప్రభుత్వమువారు ఆ Channel కొరకు ఎంత ప్రయత్నిస్తున్నారో, అదేమాదిరి యీ Low level Channel కోసము ప్రయత్నించడములేదు ఎందుకంటే, అక్కడ ఆ కాలవకు నీరు పంపకము విషయములో దానికి నీరు విడిస్తే, దీనికి తగ్గుతుందేమోననే సందేహముతో అది పూర్తిఅయ్యేవరకు నెల్లూరుజిల్లాల కాలువలకు రావు అనిచెప్పి ఒక పెద్దప్రచారము జరుగుచున్నది అది నిజమైనట్లయితే యిక మా నెల్లూరుజిల్లాకు నందికొండనీరు వస్తుందనే ఆశ లేకుండాపోతుంది కాబట్టి గుంటూరుజిల్లాతోపాటు యీ low level channel నందికొండయొక్క ప్రథమ దశలోనే మా నెల్లూరుజిల్లాలోకూడా కాలువలు త్రవ్వించి నీరు పారుదల అయ్యేటట్లు చేయాలని కోరుతున్నాను ఈ Low level channel ను main channel గానే ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను రెండవది తుంగభద్ర హైలెవెల్ ఛానలు మొత్తము మీద ప్రాజెక్టు ఖర్చుతో కూడా చేరకుండా అక్కడ low level channel కు అయ్యే ఖర్చు మాత్రము చూస్తే కొద్ది అయినప్పటికినీ దాని క్రింద అయ్యేనీటి పారుదలమాత్రము ఎక్కువగా వుంటుందని అంటున్నారు ఆ Channel కు

అయ్యేఖర్చుకూడా మొత్తం దీనితో లెక్క వేస్తే యీ భూమికి ఎక్కువ ఖర్చు అవుతుందని చెప్పవచ్చును ఆ మాదిరిగా మాకు నందికొండ డాము వస్తే ఆ డాము క్రింద వచ్చే Low level channel ను main channel గా చేస్తే దాని ద్వారా వచ్చే నీరు దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరి తాలూకాలకు పోయేటట్లుగా ఒక కాలువ తీస్తే అంతకంటె కొద్ది ఖర్చుతో దాదాపు ఐదు లక్షల యకరాలదాకా నీటి సౌకర్యం కలగటానికి అవకాశము వుంటుందని ప్రభుత్వమునకు తెలియజేస్తున్నాను

మరొక విషయము వున్నది నా నాడు సుమారు 17 సంవత్సరములనుంచి ప్రభుత్వము ఎన్ని కరువుపనులు చేయించుచున్నప్పటికినీ మా ఉదయగిరి నియోజకవర్గములో ఒక మైలు దూరము గూడా మట్టిరోడ్డు అయినను వేయలేదు ఇటువంటి firka లలో జాతీయాభివృద్ధి కార్యక్రమాలలో రోడ్ల అభివృద్ధికిగాను జిల్లాకు యిచ్చిన quota లో మా తాలూకాలోను మా నియోజకవర్గములోను ఖర్చు చేయవలసిందని అంటున్నాను మా ఉదయగిరి తాలూకాలో మొత్తానికి రోడ్డు సౌకర్యాలు లేవు అక్కడ వున్న రోడ్డు సౌకర్యాలు శిథిలంగా వున్నవి మన ముఖ్యమంత్రిగారు మా నియోజక వర్గములో 1937 వ సంవత్సరములో పర్యటనచేసి గెలిచి లోకల్‌బోర్డులకు మంత్రిఅయ్యారు మరల 1942 వ సంవత్సరములో గెలిచి ఆర్థికమంత్రి అయ్యారు ఇప్పుడు గెలిచి మరల ముఖ్యమంత్రి అయ్యారు నేనుకూడా కాంగ్రెసుటికెట్టు లభించినందున గెలిచి వచ్చాను ఈ ఎన్నికలలో ఆ నియోజకవర్గములో తిరిగివచ్చాము కాని అక్కడ క్రింద అడుగు పెట్టటానికి తావులేని పరిస్థితులున్నవి అక్కడ ఏ రకమైన రోడ్లులేని పరిస్థితులున్నప్పుడు అక్కడ యుగాలుగా నివసించే జనము ఏ విధంగా బ్రతుకుతున్నారో అని ప్రభుత్వము గుర్తించాలి ప్రభుత్వము యింతవరకు గుర్తించలేదు కనుక నే అక్కడ రోడ్లు సౌకర్యాలు ఏర్పాటు చేయలేదు ఇకమీద అయినా ఏర్పాటు చేస్తారని నమ్ముతున్నాను

తరువాత పరిశ్రమలు పరిశ్రమలు అని ప్రభుత్వమువారు అంటున్నారు మా తాలూకాలో యినుము, రాగి aluminium గనులున్నవి అవి అక్కడ విశేషముగా దొరుకుతాయి ఇనుముతో వ్యవసాయపరికరాలు చేయవచ్చును రాగితోను aluminium తోను పాత్రసామగ్రి తయారుచేయించవచ్చును ఇవన్నీ మనదేశములో అవసరమైన వస్తువులు కాబట్టి యిక్కడ తయారుచేసినవి యీ దేశములోనే ఖర్చుఅయ్యే అవకాశాలు ఉన్నవి Market down అవుతుందనే భయముకూడా అక్కరలేదు మా నియోజకవర్గములో రాగిపనులు ఎక్కువగా చేస్తారు ఇంతవరకు మనము యీ ముడిసరుకును విదేశాలకు పంపుచున్నాము ఆవిధంగా కాకుండా యిది మనదేశములో మనకు కావలసిన వస్తువులు యంత్రాగారాలద్వారా తయారుచేయించవచ్చును కాబట్టి వీటికిగాను ప్రభుత్వము యీ పరిశ్రమలు నెలకొల్పినట్లయితే వీటికి యేనాడుగూడా మార్కెటు down కాదు కనుక, నిరుద్యోగసమస్య చాలావరకు తీరిపోతుంది మనదేశములో చాలామంది చేతి పనులలో బాగాతయారైనవారున్నారు వీరి ప్రజానీకానికి చేతిపనులు నేర్పించి యీ నిరుద్యోగసమస్య నిర్మూలించవలసిందిగా కోరుతున్నాను

Sri B SIVAYYA — అధ్యక్షా క్రిందటి మూడువారాలు బడ్జెటుసమావేశములో అనేకమంది మిత్రులు చాలా సలహాలు చెప్పివున్నారు కాని కొన్ని ముఖ్యమైన సూచనలు ముఖ్యమంత్రిగారికి ముఖ్యముగా వ్యవసాయ, ఆర్థికశాఖ ను నిర్వహిస్తున్నందువల్ల వారిదృష్టికి తీసుకురాదలచుకున్నాను వ్యాపారపంటల విషయములలో వాటిని

ప్రోత్సహించాలని ఈ ప్లానింగు మంత్రిగారు కూడా నిన్న చెప్పారు కాని సరిగా ప్రోత్సహించాలనే details లోకి వెళ్ళినట్లయితే సన్నకాట్టులో కాని ప్లానింగులో కాని ఏవిధమైన ప్రోత్సాహము కూడా కల్పించలేదు వ్యాపార పంటల నిమిత్తము వాటికి మార్కెటు కమిటీలు స్థాపించే వుద్దేశ్యము, మంచిధరలు నిర్ణయించేనిమిత్తము మద్రాసు కమర్షియల్ మార్కెటు యాక్టు ఒకటి స్థాపించబడింది దానిని అనుసరించి కొన్ని జిల్లాల్లో మార్కెటింగుకమిటీని స్థాపించారు కాని ఆర్థికంగా సరియైన ప్రోత్సాహం కూడా ప్రభుత్వమువల్ల రావడములేదు ఈ మార్కెటింగ్ కమిటీల వుద్దేశ్యము చాలా మంచిది అయివున్నది ప్రతిమార్కెటు కమిటీకి bare house లను attach చేయడము తరువాత auction yards attach చేయడము మరి వివిధ రకము లైనటువంటి ప్రొవిజన్సును అక్కడకు తెప్పించి కాంపిటీటివు ప్రైసెస్ రైతులకు వచ్చేలాగు చేయడానికి అవి రైతులకు వచ్చేవాటికి గిట్టుబాటు అయిన ధర తను వచ్చేంత వరకు కూడా వేర్‌హౌసులను తాకట్టుగా పెట్టడానికి ప్రొవిజన్సు కల్పిస్తున్నారు ఏవిధమైన ప్రొవిజన్సు కూడా ఈ ఎస్టేటులో చూపించకుండా వున్నందుకు చాలా విచారంగావున్నది వ్యవసాయ సంబంధమైనటువంటి వ్యాపారాలుగాని, రైతులకు సంబంధించి నటువంటి ఇతర సౌకర్యాలు గాని వున్న పన్నులు వేసే విషయంలో గాని సూచనలు చేసే సమయంలో స్టేటు అగ్రికల్చరల్ బోర్డును స్థాపిస్తామని ఎన్నికల ప్రోగ్రాములో 35 వ పాయింటుగా మనము చెప్పుతున్నాముకూడా దానివిషయమై మీరు ప్రస్తావించక పోవడము దానిని గురించి ఇంతవరకు ఏవిధమైన చర్య తీసుకోక పోవడముకూడా చాల శోచనీయముగా వున్నది ఈ విషయములో ముఖ్యమంత్రిగారు త్వరగా చేస్తారని ఆశిస్తున్నాను ఈ ప్లానింగు విషయములో Local Development workers విషయములో గాని ప్లానింగు విషయంలోగాని జిల్లాల్లో జిల్లా ప్లానింగు కమిటీలన్నీ కొన్ని construct చేసి వున్నారు వాటిల్లో చూచినట్లయితే ప్రజలచే ఎన్నుకో బడినటువంటి ప్రతినిధులుకు ఏమీ అవకాశము లేకుండా అచ్చగా అధికారులకు మాత్రమే voice వుంటోంది జిల్లా ప్లానింగు సబ్‌కమిటీలో 19 మంది అఫిషియల్సు 14 మంది నాన్ అఫిషియల్సు అదే విధముగా N E S స్కీము సబ్ కమిటీలో 11 మంది అఫిషియల్సు, 5 నాన్ అఫిషియల్సు వున్నారు అదే విధముగా ప్రతికమిటీలో కూడా అఫిషియల్సు ఎక్కువగా వుంటే మీరు శాసనముల సయితము ప్రతిపాదించి నటువంటి సమయములో కలెక్టరు ముందుగానే దానికి ప్రెసిడెంటుగా వుండి త్రోసి వేయడమువల్ల పోతున్నది అందువల్ల ప్రజా ప్రతినిధులకు ఏ విధముగా కూడా తగిన ప్రాతినిధ్యము లేకుండా పోతున్నది ఈ విషయాన్ని గుర్తించుకొని తగునైన instructions ఇస్తారని చెప్పి ఆశిస్తున్నాను

Sri H RAMALINGA REDDI — Sir, I would like to place before the House a few points in regard to the development of the Tungabhadra ayacut There seems to be an impression gaining ground that the ayacutdars under the Tungabhadra project are not making use of the water or at any rate they are not enthusiastic to make use of it This is a wrong idea and I want to dispel that impression For the first time, the

inauguration of letting water into the canal was held in July 1953, that was only an inauguration and actually no water was let in It was only in September 1954 that water was let into the canal for irrigation purposes At that time most of the bungari crops were sold and the ryots could not make use of the water and it was also not helpful to them This year water is being made available for about 70 000 acres of land The length of the Tungabhadra canal in Andhra State is only 135 miles, the balance of the entire length of 240 miles being in the Mysore State For 85 miles only water was let into the low level canal and for the balance 50 miles no water was let in The ryots have already prepared the grounds for getting bulldozers and tractors for ploughing and they are also now busy with transplanting and broadcasting operations The ryots are as enthusiastic as any other people in any other project We should not forget that no project ever came into existence that developed overnight, we cannot expect the entire country to become green overnight Certainly our progress now under the Tungabhadra project is as great as under any other project hitherto developed

In this connection, I would like to make some suggestions as an incentive for the further development of the ayacut earlier than we expected Loans are given to the ryots in the project area by the Revenue Department Agricultural Department and the Co operative Department at the usual rates of interest Instead these loans should be given to them at reduced rates of interest if necessary by taking subsidy from the Central Government Fertilizers also should be supplied at subsidized rates During the time of the previous Ministry, there was a system of payment of subsidies for manufacture of compost, ryots were asked to prepare compost pits by giving them some subsidy That system should be revived once again Another important factor is that under the Tungabhadra project there is absolutely no perennial zone for Andhra area Localization was done when we were in the composite Madras State The perennial zone that was localized is now entirely in the Mysore State What we have got now is mostly dry cum wet irrigation with little wet area My submission to the Government is that we should create a perennial zone in our Andhra State also

Also Tungabhadra low level canal water should be made available to the people on the right side of the canal There are many villages on the right side of the canal and water is not made available for those villages Water for these villages should be made available at least for drinking purposes as in many villages scarcity of drinking water is a problem of drinking water is there for many years past and it has not been solved I hope that this Government would solve it as early as possible because it is now practicable to supply water from the nearest canal As it is not possible to tap water in black cotton area I feel this is the only alternative from which we can supply drinking water to these villages

Then, Sir, after bifurcation of Bellary district I wish to bring to the notice of the Government and which I have done already several times during the time of the previous Government, Alur and Adoni have been tagged on to Kurnool district So much so Kurnool district has become very large and inefficiency also has increased in the administration The people of those two taluks find it very difficult to come to Kurnool for their litigation purposes, During the last Ministry an Additional District and Sessions Court was located and it was abolished Now we want a sub court to be located at Adoni I do not see the point why the Government is insisting in having the sub court and the district court both at Kurnool It will facilitate the litigant public if a sub court is located at Alur We expected more conveniences and facilities in Andhra State than what we expected in the composite Madras State The people of these two taluks which are bifurcated from Bellary district, are put to much difficulty and inconvenience I have already represented to the Government to rectify this and provide a sub court at Adoni which the Government have not done so far I understand that Bellary will come to us and a new district will be formed That will be a panacea for all these ills But now, I want the Government to locate an Additional District and Sessions Court at Adoni because sessions cases are already posted to the end of November in the Sessions Court at Kurnool That will facilitate easy disposal of cases We should remember that justice delayed is justice denied Hence, I request that a sub court, if not an Additional District and

5th August 1955] (Sri H Ramalinga Reddi)

Sessions Court, should be started at Adoni immediately Thank you, Sir

Sri M SATYANARAYANA RAJU — అధ్యక్షా ! ఈ appropriation bill ను గురించి general గా మాట్లాడవలసి వచ్చినప్పుడు ముఖ్యముగా మార్పురావాలి అందరు ఒప్పుకొనవలసినదే మొత్తముమీద మార్పు మూడు విధములు సంఘములో మార్పు, భూమి మార్పు, వృత్తి మార్పు ఈ మూడు మార్పులు ముందు భావములో మార్పు ఉంటేనే కాని జరుగవు ఇప్పుడు భావములో మార్పు రాలేదని opposition bench వారు విమర్శ చేస్తున్నారు కాని పూర్వము ఏవిధముగా ఉన్నదో అదేవిధముగా ఈ set up నడుస్తున్నది గాని మార్పు ఏమీలేదు అందువల్ల వారు విమర్శచేయవలసి వచ్చింది ఈ పన్నుల విధానములో 3 రకముల పన్ను వేశారు ఒకటి సన్న గుడ్డమీద, 2 పత్రికలమీద, 3 నీటి తీరువ మొదటి రెండు పన్నులను ఎవరూ విమర్శచేయలేదు ఎందువల్లనగా ఆ పన్నుల వల్ల పేద ప్రజానీకమునకు నష్టములేదు ధనవంతులు మాత్రమే కట్టుకొనవలసియున్నది ఇక మూడవది నీటి తీరువ మీద అందరూ విమర్శించారు అందువల్ల ముందు set up లో మార్పు ఉండాలి మొట్టమొదట మంత్రిగారు నీటిని, electricity యిచ్చినప్పుడు మేము ప్రజలకు చేసే సేవకు డబ్బు పుచ్చుకుంటున్నాము పుచ్చుకోకూడదా అన్నారు అది legal గా right కాని సామాజికంగా కాదు కాని సామాజికంగా మార్పు రావాలని కోరుచున్నాను మన దేశములో పుట్టిన వెనుకబడిన వారలకు గవర్నమెంటు ఉచితముగా ఎందుకు సేవ చేయకూడదు అటువంటి సేవ చేసినప్పుడే రేపు ప్రొద్దున మన దేశమును కాపాడడానికి త్యాగము చేస్తారు జపాను ఏవిధముగా త్యాగము చేసినదో మొన్నటి యుద్ధములో జపానువాళ్ళు ప్రాణమును కూడా తృణప్రాయంగా చేసుకొని అమెరికా ఓడ మునిగిపోతే చాలు అని భావించి ప్రాణత్యాగము చేశారు దానికి కారణము వారలకు సమానమైన హక్కులు ఉండడమే కనుక మన సంఘాలలో అలాంటి ఏర్పాటు లేనప్పుడు దేశమును ఏవిధముగా కాపాడెదరు ఒక ధనిక వర్గమువారు ఎవరో ఒకరు ప్రాణత్యాగము చేసి దేశమును రక్షించలేరు కనుక ఎప్పుడైనా దేశమును రక్షించాలనుకుంటే ప్రజలు వారికి ఉచితముగా సేవ చేయవలసి ఉంటుంది అందుచేత దానికితోడుగా ఈ గవర్నమెంటు దగ్గర మామూలుగా పన్నులు విధించినది చెల్లించి, గవర్నమెంటుకు సానుభూతిగా ఉండాలని అట్లా ఉంటేనే ఈ ప్రభుత్వము నడుస్తుంది. ఒక మాట రెవిన్యూ మంత్రిగారు socialism అంటే ఉన్నదంతా ఊడకొట్టుకొని అందరూ పేదవాళ్ళు అవుట కాదు Socialism అంటె అందరూ ఒప్పుకొనవలసినదే ఉదాహరణకు ధనిక వర్గమువాడు మేడలో ఉన్నాడు పేదవాడు పూరిగుడిసెలో ఉన్నాడు అయితే ఈ ధనికుడు మేడయింటి మీద మేడకట్టుటకు ప్రయత్నము చేస్తున్నాడు పూరింటివాడు తన యిల్లు తప్ప యేమి కొనుటకు సిద్ధముగా లేడు ప్రభుత్వము ఆ మేడమీద మేడవానిని అధికముగా చేయనివ్వకుండా చేయాలి కనుక పేదవాడు తన యింటి గోడలను గట్టిగా చేసుకోడానికి దారిద్ర్యమును తొలగించవలెను ఆ విధముగా వర్గరాహిత్యము అయిన సమాజము తయారు అగుటకు ఆ విధముగా మార్పు రావాలి తరువాత భూమిమార్పు land reform చేయ బోవుచున్నారు ఆ విధముగా చేయ బోవుచున్నారు. ఆ విధముగా చేయ బోయేటప్పుడు యినాములను రద్దుచేస్తామని వాగ్దానము చేశారు. అందుకు ఈ గరిష్ట కనిష్ట పరిమితిని ఏర్పాటు చేయవలసి ఉంటుంది.

ప్రతివారు దేశములో నాస్తికముగా అభిమానము కలిగి అన్ని విధాలా తోడ్పడటానికి అవకాశము ఉంటుంది కనుక ఆ విధముగా చేయవలసి ఉన్నది ఇక వృత్తి మార్పు వృత్తిలో మార్పు ఏ విధముగా వస్తుంది అనేది సమస్య మన education ను బట్టి వస్తుంది ప్రస్తుత పరిస్థితులలో education ఏవిధముగా ఉన్నదంటే ఏదో చదువుటము తోనే ఏదో పరీక్ష pass కావడము తోటే certificate పుచ్చుకొని ఉద్యోగమునకు వెళ్ళడము అనే దీక్షతో ఉన్నారు ఆ దీక్షను మార్చాలి ఆ దృష్టి మార్చాలి ఆ దృష్టి మార్చాలంటే మన education విధానము మార్చాలి ఇప్పుడు higher education యొక్క ప్రాధాన్యము తగ్గించడం చిన్న చిన్న primary education secondary education కు ఏదో ప్రాధాన్యము యిస్తూ వాటిలోకూడా technical education జాపరిస్థితో ఎంతవరకు చదువగలుగుతారో అంతవరకు చదువు చెప్పించిన వారలు స్వేచ్ఛగా జీవనము గడుపుటకు ధైర్యము వచ్చును కనుక education set up మార్చాలి అంతే కాని ఆ విధానమే ఉన్నట్లయితే employment హెచ్చు అవుతుంది ముఖ్యముగా మనదేశములో 100 కి 80 మందివరకు వ్యవసాయము చేస్తున్నారు ప్రతివాడు eighth class pass కాగానే వాడు వ్యవసాయము చేసుకోగల దారుఢ్యము కలిగిఉండాలి ఆవిధముగా higher grade training schoolsలోకూడా agricultural schools కూడా పెట్టినట్లయిన ఒక విద్యార్థి తన సర్టిఫికేటును తీసుకొని ఉద్యోగమునకు వెళ్ళినప్పుడు ఆ ఉద్యోగము దొరకనప్పుడు వాడు తన స్వంత భూమిని వ్యవసాయము చేసుకోగల సమర్థత, సామర్థ్యము కలిగి ఉండును అప్పుడు అతడు తనకు ఉద్యోగమే కావలెనని దానిమీదనే ఆధారపడి ఉండడు అందువల్ల నేను ఆవిధముగా ఈ పద్ధతిని మార్చాలని కోరుతున్నాను—

Sri N VENKAIAH — అధ్యక్షా ! ఈ బిల్లును బలపరుస్తున్నాను ఈ పంచవర్ష ప్రణాళికను తయారు చేసేటప్పుడు ఒక మాసం రోజాలంతా ఉద్యోగుల కాలము, అనంగా ఉద్యోగులను నియమించికూడా వినియోగించారు 350 కోట్లకు ప్రణాళిక తయారైనది కాని యీ ప్రణాళికలో 11 కోట్లు మాత్రమే allot చేశారు మీరు ప్రజలలో ప్రజాభిమానం పొందగలిగిన ప్రణాళిక తయారు చేయాలని ప్రభుత్వం కాడు తమ కాలాన్నంతా వినియోగించినప్పుడు అది పార్టీ తత్వాలకు లోనుగాకుండా అక్కడ వుండే గ్రామస్తుల నడిగి వారి పరిస్థితుల నభివృద్ధిచేయడానికి ఎంతవరకు ఖర్చుపెట్టడానికి అవకాశం వుంటుందో అంతవ కే చెప్పిస్తే బాగుండేది కాని యిప్పుడు 350 కోట్లనుంచి కార్యక్రమం పెట్టినప్పటికీ గ్రామస్థుల దృష్టిలో ప్రాధాన్యత వహించేది ఏదో ఒకటి యిందులో లేకుండా పోవచ్చు Public Works శాఖలో ఎక్కువ దుబారా అవుతుందని చాలమంది సూచిస్తున్నారు ఐతే యీ దుబారా లేకుండా ప్రజలవల్ల 50 వంతులు డబ్బు వసూలుచేసి, ప్రజల నుత్సాహపరచి, ప్రజా సహకారం స్వీకరింపబడిన, తయారుచేయబడిన ప్రణాళికే అయివున్నది ఐనప్పుడు అది 11 కోట్లు కాకుండా యిదివరకు నిర్ణయించిన యావత్తు మొత్తాన్ని వుంచినట్లయితే బాగుండేది ఈ వినియోగించే డబ్బు నిరర్థకం కాకుండా వుండాలంటే ప్రజాభిమానం కలిగిన స్కీములు రూపొందించాలంటే, జిల్లా కమిటీలకు మళ్ళా పంపించి యీ 350 కోట్లు ఏరూపంగా ఖర్చించాలో అవకాశం యిస్తే కొంతవరకైనా అసంతృప్తి ఉపశమించ డానికి అవకాశం వుండగలదని మనవి చేస్తున్నాను తరువాత యీ విద్యావిషయంలో ఎలిమెంటరీ స్కూళ్ళు సాధారణంగా ఆ కేక యాజమాన్యముల క్రింద వుంటున్నాయి.

రెండువేలు జనాభాకలిగిన గ్రామంలో private management school ఒకటి, Labour స్కూలు ఒకటి, జిల్లా బోర్డు పాఠశాల, క్రిస్టియను స్కూలు, యిన్ని వుంటున్నాయి యిద్దరుపాధ్యాయులుండే యీ పాఠశాలలోను విద్య సరిగా నేర్పడానికి అవకాశం లేకుండా వుంటుంది Private management school, పంచాయతి స్కూలు, జిల్లాబోర్డు స్కూలు, labour పాఠశాలలు కూడా ఉన్నాయి Management తమ నచ్చినంగా చూచుకోడానికి అవకాశంలేక క్రిస్టియను మతప్రచారం కోసం ఉపాధ్యాయులను నియోగించుకుంటారు కనుక తగినంత management లేకుండా వున్నట్టి క్రిస్టియనుమిషనరీ యాజమాన్యాన వుండే పాఠశాలలు కనీసం యీ మూడు తరగతులకైనా తాలూకాకమిటీ ఒకటి కుప్పుస్వామికమిటీ సిఫార్సుల ననుసరించి ఏర్పాటు చేయవలసినదని కోరుతున్నాను Elementary Education కు గాని లేక Secondary Education కు 5 కోట్లు వినియోగిస్తున్నారు ఈ Elementary Education, Secondary Education పూర్తిగా అభివృద్ధి కావాలంటే గ్రంథాలయాలు తప్పనిసరిగా అవసరం అగాక Secondary Education అయిన అనంతరం కూడా గమ విజ్ఞానం పెంపుచేసుకోవాలంటే గ్రంథాలయాలు తప్పకుండా వుండాలి గ్రంథాలయాలవిస్తరంలో డబ్బు వినియోగించడానికి ప్రభుత్వం ఎందువల్ల సంకోయిస్తున్నదో నాకు అర్థంకావడంలేదు గ్రంథాలయాలను ఎంత అభివృద్ధిచేసి, గ్రంథాలయాలలోని మంచి పుస్తకాలను ఎంత ఎక్కువగా ప్రజల అందుబాటులోకి తీసుకువస్తే అంత విద్యాభివృద్ధి జరగడానికి అవకాశం వుంటుంది ప్రజలు శక్తివంతులవడానికి అవకాశంవుంటుందని మనవిచేస్తున్నాను అందువల్ల 5 కోట్లు విద్యకో వినియోగించేవారు యింకో కోటికూడాయు గ్రంథాలయానికి వినియోగించడం చాలా అవసరమని నేను మనవిచేస్తున్నాను గ్రంథాలయాలకు యిచ్చేది Grants చాలా తక్కువ వుంటున్నాయని నేను మనవి చేస్తున్నాను మనం వైద్యం విషయములో ఏ విధంగా కూడా ప్రజలను తృప్తి పరచలేకుండా వున్నాం అనేకమంది బీదవారు కూడా private వ్యక్తుల దగ్గరకు వైద్యానికి పోతున్నారంటే దాని రహస్యము అందరికీ అర్థము అవుతుంది డాక్టరును పెంపు చేసినపుడు ప్రభుత్వ వైద్యాలయాలు పెంపు చేస్తే, వైద్యసహాయం సులభంగా అందరూ పొందడానికి అవకాశం వుంటుంది కేవలం ఇంగ్లీషు వైద్య కాలేజీలు పెంపుచేయ లేకపోతే హోమియోపతీ, ప్రకృతి వైద్యంలాంటి సులభమైన, ఉపయోగకరమైన వైద్య శాస్త్రాలను నేర్పే పాఠశాలలను పెట్టించాలని సూచిస్తున్నాను గుడివాడ హోమియోపతి స్కూలుకు అవకాశం యిస్తాం, కొంత grant యిస్తాం అని సూచించినందుకు సంతోషం అలాగే ఆయుర్వేదం విషయములో కూడా త్వరలో కాలేజీ ఏర్పాటు చేయడానికి ప్రయత్నం చేస్తారని నమ్ముతున్నాను తరువాత ఖాజీపేట నుంచి గూడూరువరకు రైల్వేలైను వేయడానికి Central ప్రభుత్వము సూచన చేసినది అది గుంటూరు జిల్లాలో, నెల్లూరు జిల్లాలో కూడా యిదివరకు ఏ దారి అందుబాటులో లేని పట్టణాల మీదుగా తాలూకాలు మీదుగా అది పోవూరు వెళ్ళే అవకాశం వున్నది దాని విషయములో ప్రధాన మంత్రిగారు ఢిల్లీ వెళ్ళినప్పుడు శ్రద్ధ వహిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :—అధ్యక్షా! ముఖ్యమంత్రిగారు Appropriation Bill ను యీ రోజు ప్రతిపాదించారు. నేను ఆనందంతో బలపరుస్తున్నాను. కాని కొన్ని విషయాలు ప్రభుత్వానికి, ప్రతిపక్ష సభ్యు లందరికి, మాలో వున్న యితర సభ్యులకు మనవిచేయదలచుకున్నాను. ప్రభుత్వం education విషయంలో High Schools మూసేశారని యీ మధ్యను అనుకొన్నాం, డబ్బు యిస్తాం అని వాగ్దానంచేసి డబ్బు యివ్వకపోవడంచేత కొన్ని స్కూల్సు మూసి వేయడానికి orders వేశారు. ఆవిధంగా orders వేయబడినవారిలో సాధారణంగా ఏ 10 మందో 5 గురో తప్ప మిగలినవారందరూ వారు చేసిన వాగ్దానం ప్రకారం మళ్ళీ తిరిగి డబ్బు కట్టి open చేయవలసినదని కోరగా ఆవిధంగా open చేసినందుకు ప్రభుత్వంవారిని అభినందించవలసివున్నది. 19 తారీఖున రివిన్యూ డిమాండులో మన గంజి నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ ఊపేశారు అసెంబ్లీ అంతా నా బిల్లు, నా బిల్లు నా బంజర్ల పంపకం బిల్లు అని. వారి అదృష్టవశాత్తు లాటరీలో ఆయనపేరు వచ్చింది. మేమంతా బలపరచాం. ఆవేళ ఆయన ఒక్కరిదేకాదు ఆ బిల్లు అసెంబ్లీఅంతా బలపరిస్తే వారి బిల్లు అనుకుంటున్నారు వారు. అందరికీ యిప్పుడు బంజారుభూముల పంపకం విషయంలో చాలా ఆతృతగా వున్నది. అందరూ ఉత్సాహంతో వున్నారు, బంజరుభూములను పంచియివ్వాలని కోరుతూవున్నారు. ఇంకా వారితో మనవిచేస్తున్నదేమిటంటే హరిజన మెంబర్లున్నారు, చాలాతక్కువ జనసంఖ్య వున్నారుకదాఅని హరిజనులకు ప్రత్యేకంగా స్థానాలు యిచ్చి representation యిచ్చారు. వారు చేయవలసిన బాధ్యతప్రకారం హరిజనులందరినీ వారు బాగు చేసినవారు సవర్ణహిందువులు వారికి చేసే నిబంధనల ప్రకారం మేము కూడా సవర్ణ హిందువులము బాగుచేయడం కోసం బాధపడుతున్నాం. వాళ్ళలాగే మేము ప్రతినిధులుగా వచ్చాం. వారు చేయవలసిన డ్యూటీ వారు చేసినపుడు అలాగే మేము కూడా మేము చేయవలసిన డ్యూటీ చేస్తాం. ఇక్కడ ఊపే ఊపులు హరిజన Villages లోకి వెళ్ళి చదువుకునే విషయంలోనూ, బంజర్ల తగువుల విషయంలోనూ వచ్చే ప్రమాదాన్ని తప్పిస్తారని కోరుతున్నాను. అందుచేత ఒక చిన్న ఉపమానం చెబుతున్నాను. నేను పెదగుమ్మలూరు estate లో ఒక ఖండానికి ex proprietor ను. అండి నాతోటిచెరిసగం వంతుదారు, బాధ్యతగలవారు, నీలాద్రిపురం ప్రొప్రయిటరుగారు వున్నారు. ఈ 10 సంవత్సరాలలో abscond అయిపోయారు వారు వెళ్లారు. వారే ఈ సంవత్సరం ముఖ్యమంత్రిగారికి train లో చూపించాను ఆచోటు. అక్కడ చెఱువంతా వర కట్టించేసి హరిజన్లను కొంతమందిని మాయ చేసి మీకు నేను భాగం కౌలుకు యిస్తాను అని ఒక్కొక్కరికి 15 సెంట్లో, 20 సెంట్లో కట్లు వేయించేసి ఆక్రమణ చేశారు. యిది అన్యాయంకాదా? ఇలాంటి విషయంలో హరిజన మెంబర్లు హరిజన villages కు వెళ్ళి న్యాయంగా యిది చెఱువు తాలూకు గర్భం, యీ పంతులుగారు వచ్చి అనవసరంగా వరకట్టి మిమ్మల్ని దురాపేక్షలో పెడుతున్నారు, మీరు మాత్రం అలాంటి దురాపేక్షలో పడవద్దని చెప్పి వారిని బాగుచేయడం వారి బాధ్యత కాదా? ఇంకో విషయం మనవి చేస్తున్నాను. ఇప్పుడు మా ఊరట్ల Basic Training School వున్నది. ఆ Basic Training School కి యీ సంవత్సరం Secondary grade కి మా జిల్లానుంచి ఒక్క harijan student కూడా రాలేదు. పాపం,

రాజోలు తాలూకానుంచి, నరసాపురం తాలూకానుంచి కొందరు వచ్చారు వారికి వచ్చిన మార్కులు ఏమిటి? నూటికి 5, 10 చూడండి విద్యార్థులు క్లాసుకి యివ్వాలి 4 సీట్లు అందుచేత బాగా మార్కులు రాకపోయినా వారికివ్వాలి మొన్న మాకాపూ, జియ్యరు దాసుగారు కలవిచ్చారు ఇంకా పండితుల్ని స్కూళ్ళలో ప్రవేశపెట్టి యింకా పంతుళ్ళవారిచేత కూడా పాఠాలు చెప్పించాలని ఈ విషయం వారు గ్రహించాలి నాలుగైదు మార్కులతో స్కూళ్ళలో ప్రవేశించి ఎంతమంది పిల్లల్ని ఏవిధంగా అభివృద్ధి చేస్తారో వారు కలవిస్తారని మనవిచేస్తున్నాను మొన్న మన రాఘవులుగారు మాట్లాడారు, 23 వ తారీఖున, ఎంత సౌమ్యంగా, ఎంత చక్కగా, ఎంత సొగసుగా మాట్లాడారో కొంచెం మీరంతా, హరిజన మెంబర్లంతా ఆ speech చదువుకోండి హరిజన మెంబర్లంతా ఉపద్రవంగా అసెంబ్లీ అంతా లేచిపోయేలాగ మాట్లాడారు ఇలాగ లేచిపోయేలాగ మాట్లాడితే వారికే ప్రమాదం వస్తుంది అందుచేత మేమంతా 30 మంది వున్నాంకదా, యిద్దరే కదా కమ్యూనిస్టు మెంబర్లు మేమంతా కాంగ్రెసు వాళ్ళం మేము ఎలాగవచ్చేం అనుకుంటున్నారు నేను దానికి జవాబు 18 వ తారీఖున మనవిచేశాను వారు బహుశా వినియేవుండరు అంటే ఎప్పుడు వారు assembly లో వుండరులెండి ఇందులో వుండేవారు బహుతక్కువ వినరండి అంటే ex minister కూర్మయ్యగారండి కూర్మయ్యగారు 'కొన్నిజాతులవారు మాకు వివాహాలకు పిల్లలను యివ్వడములేదు' అన్నారు అవును వారికోరిక ప్రకారము అంగీకరించినవారు అన్ని జాతులలో కూడా పెండ్లి చేసుకుంటూనే వున్నారు అంగీకరించని వారిని కూడ చేసుకోమంటే దాని ప్రమాదము చాలవుంది దీనిని కొంచెము తెలిసికొని వారు వారి కులాన్ని వారి జాతిని ముందు బాగు చేసుకొని ఇతరులను కూడా ఆ విధంగా రమ్మని కోరితే కొంచెము అర్థముంటుంది ఒక్క చిన్న విషయమును మనవి చేస్తున్నాను Prohibition విషయములో చట్టముఅమలు జరుగుతుందా అని మొన్న మన కాంగ్రెస్‌లో వుండే హరిజన members చాల మంది అన్నారు చట్టాలు జరుగకుండు చట్టాలను మనము అమలు పరుచలేదు కనుక చట్టాన్ని మనము అంగీకరించడము లేదు కనుక చట్టానికి మనము బధ్ధులవుడము జరుగడములేదు అది గవర్నమెంటువారి లోపము అందుచేత మన నియోజక వర్గాలలోని ప్రజల దగ్గరకు వెళ్ళి చట్టాలు అమలు జరుపకపోవడము మనదే బుద్ధి తక్కువ అని చెప్పి జ్ఞానము చెప్పవచ్చు M L A లను నేను కోరేది ఏమిటంటే రాజకీయమంటే ఏమిటి? ప్రభుత్వమంటే ఏమిటి? ప్రజలంటే ఎవరు? మనకూ రాజకీయాలకు సంబంధ మేమిటి? స్వరాజ్య మొచ్చిన తర్వాత మనిషి చేయవలసిన duty ఏమిటి? ఇప్పుడు ఏ విధంగా బాగుచేయాలి దేశాన్ని అనే పద్ధతులు అందరి ప్రజలకు తెలియ చేయాలని నేను కోరుతున్నాను నిజము తెలియ జేసినప్పుడు యీ బాధవుండదు అందుచేత ఈ appropriation బిల్లును బలపరుస్తూ ఇంకా చాల విషయాలు మనవి చేయవలసి వున్నది కాని time చాలిందికాదు ఇంకొకటితో సెలవు తీసుకుంటున్నా

Sri N K LINGAM —అధ్యక్షా! యీబిల్లు ప్రధానామాత్యులు పెట్టారు యీ బిల్లులో 42 పద్దులుగా కనబడుతున్నాయి యీ 42 పద్దులక్రింద సుమారు 67 కోట్లు

రూపాయలు ఖర్చు చేస్తుంది కాని ఇక్కడ శాసన సభ్యులు ఒక కులాన్ని గురించి చాల ఆవేశముతో మాట్లాడారు అందుకు నేనుకూడా ఆవేశపడను కాని నేను ఆనందించుచున్నాను ఎందుకంటే ఎక్కువమంది సవర్ణ సంప్రదాయాలువుండి ఇక్కడ welfare of schedule castes and tribes అని చెప్పారు కాని వీరు ఇక్కడ ఎందుకుపెట్టారు కేవలం ప్రభుత్వమే చేయుచేస్తుంది ఇది గుర్తించాలి అందరు సభ్యులూ ప్రభుత్వముకూడా ఎందుకంటే యితర ఖండాలలో రెండు తెగలుగా చూస్తున్నారు అదేమిటంటే rich and poor అని కాని భరతఖండములో ఆ భాగ్యము మనకు లేదు ఇక్కడ touchables and untouchables, అంటుకో తగినవారు అంటరానివారని ఉంది కాని ఆ పదము పెట్టుకుంటే హరిజనలోకమంతా చాల ఆనందించేవారము కాని backward communities అని ఒకటి పెట్టారు కోట్లకొలదీ రూపాయలతో పుష్టిగల యీ back ward కులాలవారి కుమారులకు అందరికీ కూడా ప్రభుత్వమువల్లనే చదివి ఆ ధనికులంగరూ అనుభవించుచున్నారు కాని ఇతరజాతులవారు ఆకలికుంది బిచ్చగాండ్లుగా బిచ్చమెత్తుకొనుచున్నారు వారికెందుకు వసతులు కల్పించకూడదని నేను అడుగుతున్నాను ఆంధ్రప్రభుత్వాన్ని కోరేదేమ ఏమిటంటే యీ schedule and back ward తీసివేసి touchables and untouchables అని ముద్రించి అందులో touchables లో నిరుపేదలెవరైనాసరే బ్రాహ్మణులుగాని, కోమట్లుగాని వారికి రక్షణ యివ్వాలని ప్రభుత్వముయొక్క కర్తవ్యమని నేను మనవిచేస్తున్నాను కాని నిన్న యీ పంచవర్ష ప్రణాళికలో ఒక పద్దు చూశాను, హరిజన welfare schools లో వెనుకబడినజాతుల పిల్లలకు మధ్యాహ్నము బువ్వ పెట్టుతారట ఇతర పిల్లలకు ఎందుకుపెట్టకూడదు ఇతరులుకూడా అభివృద్ధి పొందాలన్నారు హరిజన welfare schools లో వెనుకబడినజాతులకు పెట్టడము ఎందుకు వెనుకబడినజాతుల schools అని మారిస్తే బాగుంటుంది కాని అందులో అనేక కులాలు కనపరిచారు యీ దేశములో కులతత్వము పోవాలంటున్నారు వెనుకబడిన జాతులనిచెప్పి 70 కులాలపేర్లు యిస్తున్నారు హరిజనులనిచెప్పి 4-5 పేర్లు యిస్తున్నారు కాని నా మనవి ఏమిటంటే touchables and untouchables అనిచెప్పి next budget లోనైనా యీ బిల్లులో కనబరుస్తారని ప్రత్యేకముగా ఆంధ్ర హరిజనులతరఫున నేను ప్రార్థిస్తున్నాను తర్వాత వైద్య విషయములో యీమధ్యనే నా నియోజకవర్గములో మన మంత్రిగారైన నాగేశ్వరరావు గారితో hospital చూశాను ఆ hospital కు సంవత్సరానికి 5 వందల రూపాయలు మందుల ఖర్చు నెలకు వేయి రూపాయలు ఆ staff ఖర్చు సంవత్సరానికి 12 వేల రూపాయలు యీ సిబ్బందికి ఖర్చుపెట్టుతున్నారు 5 వందల రూపాయలు మాత్రమే మందులకు ఖర్చుపెట్టుతున్నారు నేను ఆ డాక్టరును రహస్యముగా అడిగాను అడిగితే ఏమిలేదండీ, ఏదో రంగులుకలిపి మందులు పోస్తున్నాము ప్రజానీకానికి కాని వస్తున్నారు ఆరకంగా అన్నారు

The Hon Sri A B NAGESWARA RAO — మొగమాటం దేనికి? ఆ hospital లో రంగులు కలిపి పోస్తామని చెప్పలేదు

Sri N K LINGAM — మంత్రిగారూ నేను పోయినప్పుడు చెప్పలేదుకాని తర్వాత enquiry చేశాను, అటువంటి Hospitals మాత్రము పోతే బాగుంటుంది,

ప్రభుత్వానికి డబ్బు మిగులుతుంది కనుక అటువంటి hospitals ను వెంటనే రద్దు చేస్తే బాగుంటుందని నేను ఒక సలహా యిస్తున్నాను మీరు రెండవ five year Plan లో యీ Railway మార్గాలు మార్చారు కాని యీ కర్నూలు పట్టణము చాల ప్రాముఖ్యమైన పట్టణము అందుచేత ఆదోనినుండి ఇటు గుంటూరువరకూ ఒక line వేయాలని చెప్పి మేము ఒక memorandum యిచ్చాము Planning committee కి శ్రీశైలము చాలా ముఖ్యమైనటువంటి క్షేత్రము యాత్రీకులు భారతదేశ సంతా కూడా ఆ క్షేత్రాన్ని దర్శించేమార్గములో వుంది కనుక దయచేసి మన ప్రధానామాత్యులు రేపు ఢిల్లీ వెళ్ళినప్పుడు యీ Bombay line ను తీసుకొచ్చి కర్నూలు పట్టణాన్ని కలుపుతూ నందికొట్కూరు, ఆత్మకూరు, మార్కాపురం మీదుగా line తీసుకవెళ్ళి గుంటూరులో చేరుస్తారని చెప్పి నేను ఆశిస్తున్నాను

Sri G NAGESWARA RAO —అధ్యక్షా! ఇప్పుడు యీ Budget సమావేశములో ముఖ్యంగా లంక భూములకు సంబంధించినంతవరకూ అసలు సరియైన విధానము ప్రభుత్వమువారు ఆలోచించవలసినది గా యిదివరకు కూడా మేము విజ్ఞప్తిచేస్తూనే వస్తున్నాము ఇతే యీ బడ్జెట్టు సమావేశములో ఏదో కొంత మార్పు వస్తుందని అనుకున్నాము కాని అదేమీ రాలేదు ముఖ్యంగా పశ్చిమగోదావరి తూర్పుగోదావరి జిల్లాలలోని లంకలను సాగుచేస్తూవున్న F L C Societies గతములో సుమారు 30 సంవత్సరాల నుంచి యీ లంక భూములను బాగుచేసి అభివృద్ధిచేసి అప్పటివుడు 4 రూపాయలు మొదలుకొని 7 రూపాయలవరకూ ప్రభుత్వమువారికి పన్ను కట్టుతూ ఆ భూములను సాగుచేసుకుంటూ వచ్చేవారు పాటలపద్ధతి ప్రవేశపెట్టినందువల్ల అవి ఎక్కువగా పెరిగి పోవడము జరిగింది యీ రోజుకు యీ పాటలపోటీలవల్ల ఎకరానికి 250 రూపాయలవరకూ ధరలు పెరిగాయి యీ రెక్కువ పన్నులవల్ల అసలువాండ్లకు పండేపంటంతా యితరులకు తాకట్టుపెట్టి వాండ్లేమీ నష్టపడుతుండడమే జరుగుతుందితప్ప అసలు యీ లంకభూములను వారు సాగు చేయడమువల్ల ఏమాత్రము ఫలితము వుండడములేదు అందుచేత గత మూడుసంవత్సరముల నుంచి కూడా మేమీ విషయాన్ని గురించి రెవెన్యూ మంత్రిగారి దృష్టికి, ప్రభుత్వ దృష్టికి తీసుకొస్తూనే వున్నాము ప్రధానముగా ఒక విధానాన్ని ప్రభుత్వము అవలంభిస్తుంది దానివల్ల యీ Societies కు చాల దెబ్బ తగిలింది అదేమిటంటే 3 years average rental ఆ average rental కు ఏ Society ఐతే అంగీకరిస్తుందో ఆ Society కి ఆ లంకలు యిస్తామనే విధానము అవలంభిస్తున్నారు ఆ societies గత 3 సంవత్సరముల average rate కట్టుకోడానికి వారు నిశ్చయించలేక పోతున్నారు ఎందుచేతనంటే అది వంద రూపాయలకు గతములో వాండ్లు ఎప్పుడో చేసుకుంటే మూడువందల రూపాయలై కూర్చుంది అందుచేత యీ సగటు రేటుకు ఆ societies అంగీకరించకపోవడము, మాకు అక్కరలేదని వారు ఆ లంకలు విడిచిపెట్టడము జరుగుతోంది అదియే పాటకు పెడుతున్నారు ప్రభుత్వమువారు పాటకు పెట్టడము వల్ల పెద్ద రైతులు భూస్వాములు ఎక్కువకు పాడుకొంటున్నారు వారు పాటకు రాకపోవడమువల్ల ఉదాహరణకు 5,500 రూపాయలు సగటు రేటు ఇవ్వవలసిన societies ని అడిగిన లంకభూమికి పాటలో 2 వేల 5 వందలు వరకూ ఒక భూస్వామి పాడుతున్నాడు సగానికి సగము భూస్వాములు పోటీ లేకుండా పాడుకుంటున్నారు. Society వాండ్లు పాటల పోటీకి రాలేకపోతున్నారు పైకి యీ సగటు రేటు యిస్తే

ప్రభుత్వము యిస్తానని చెప్పుతుంది యీ పరిస్థితులలో ప్రతి సంవత్సరము కూడా తూర్పు గోదావరి జిల్లాలో 4,000 లంకలవరకూ పాటకు వస్తున్నాయి, పశ్చిమ గోదావరి జిల్లాలో 3,000 లంకభూముల వరకు పాటకు వస్తున్నాయి ప్రతి సంవత్సరము కూడా ఈ society లలో చాల భాగము యీ భూములను తీసుకోలేక పోతున్నారు అవి పెద్దపెద్ద రైతుల చేతుల లోనికి పోతున్నాయి అందుచేత ప్రభుత్వము వారికి ముఖ్యంగా మేము ఒక సూచన చేస్తాము అందరు కూడా అంగీకరించినటువంటి ఏ మంచి భూమి ఐన ఎట్టికి కూడా లంక భూములలో మంచి భూమికి ఎకరానికి పాతిక రూపాయలు ప్రభుత్వము వారు తీసికొని ఆ పాతిక రూపాయల చొప్పున రైతులకు lease కు యిస్తే societies కు ఏమైనా కొంత లభిస్తుంది దానికి ఇంకా తక్కువ విలువైన భూములు వుంటే తక్కువ రేటుకట్టించి ఎకరానికి పాతిక రూపాయలు మించకుండా ఈ భూములను societies కు యివ్వాలని చెప్పి మేము కోరుతూ వచ్చాము యీరోజుకు కూడా ప్రభుత్వము వారు దానిని గుర్తించలేదు యీ సంవత్సరము కూడా 3 వందల లంకలు పాటకు పెట్టారు వాటికి పెద్ద రైతులు భూస్వాములు పోటీ రావడము జరిగింది శ్రీ వెంకటరావుగారు మొన్న చెప్పడములో వారు revenue మంత్రిగా వున్నప్పుడు 8 వేల ఎకరాల లంక భూములను తూర్పు గోదావరి జిల్లాలో యిప్పించినానని చెప్పారు

నిజంగా చూస్తే వారు 8 వేల ఎకరాలు ఇప్పించినప్పటికీ కూడా వాళ్ళు ఆ సంవత్సరం ' నో బకాయీలతోనూ, ఎక్కువ రేట్లతోనూ చేసుకుని తరువాత ఆ లంకలలో పండినదంతా వడ్డీ వ్యాపారులకో, అప్పు తెచ్చిన వారికో తాకట్టు పెట్టారు తప్ప అదేమీ ఉపయోగపడలేదు అందుచేత ఈ సంవత్సరమైనా ప్రభుత్వంవారు ఎకరానికి 25 రూపాయిలు మించకుండా ఈ లంక భూములకు కట్టి F L C Society లకు ఇస్తే ఈ F L C society లలో ఎక్కువగా హరిజనులే ఉన్నారు కాబట్టి అందులోకి backward classes కూడా ఈ F L C Society లలో చాలా గ్రామాలలో యున్నారు అందులో fisherman society లున్నాయి అలాగే Back ward classes, హరిజనలూ వీరంతా జనాభాలో ఎక్కువభాగంగా యుండి పేదరికంతో బాధపడుచున్న ఈ వర్గాలకి ఈ లంకభూములను తప్పకుండా ఇవ్వాలని కోరుతున్నాం

Mr SPEAKER — You are repeating the arguments మొన్న చెప్పిందే ఇప్పుడూ చెబుతున్నారు

Sri S NARAYANAPPA — అధ్యక్షా! ముఖ్యమంత్రిగారు ఈనాడు ప్రతిపాదించిన ఈ Appropriation బిల్లును నేను బలపరుస్తూ దానిపై కొన్ని సూచనలు మాత్రం మనవిచేయదలచాను ఇప్పుడు దాదాపు మూడువారాలుగా Budget సమావేశంలో వివిధమైన demand లపై జరిగిన చర్చఫలితముగా ఇటు ప్రభుత్వపక్షసభ్యులు అటు ప్రతిపక్షసభ్యులు ఇవ్వవలసిన సలహాలు యిచ్చారు ఇప్పుడు మనకు ఎలాగా ప్రతి సంవత్సరం బడ్జెటుసమావేశం జరగడం తరువాత 12 మాసాలకు కావలసిన ప్రభుత్వ ఖర్చులు మంజూరుచేయడం, tea party జరుపుకోవడం హాయిగా, ఆనందంగా ఇంటికి పోవడం సాంప్రదాయంగా, లాంఛనప్రాయంగా జరుగుతోంది ముఖ్యంగా ప్రభుత్వంలో ప్రతిసంవత్సరముకు ముందు రాబోవు సంవత్సరానికి, వివిధమైన మార్పులు తీసుకు వచ్చినా ప్రజానీకానికి ఏవిధమైన ఉపకారం జరిగింది అనేటటువంటి విషయాన్ని యోచనచేసి ఈ బడ్జటులో లేనిది ముందుసంవత్సరానికి కావలసిన మార్పులతో

పద్ధతిని తీసుకువస్తే చాల ఉపయోగంగా ఉంటుంది ఆ పద్ధతి అనుసరించవలయును ఇప్పుడు ఈ appropriation బిల్లులో కొన్ని కోట్ల రూపాయలు అదనంగా ఖర్చు పెట్టవలసిన పరిస్థితులు ప్రభుత్వానికి సంబంధించిన పరిపాలనా వ్యవహారంలో వచ్చేటటువంటి పద్దులు కాబట్టి వాటిని అవసరంగా మంజూరుచేయవలసిన బాధ్యత సభ్యులపైన ఎంతైనా యున్నది ఈ పద్దులు ఖర్చుపెట్టేసందర్భములో ప్రభుత్వంకూడా యోచించి చేయవలయును ఇప్పుడు ప్రభుత్వ కార్యాలయాలలో ఉద్యోగులుకానివ్వండి, ఉద్యోగుల జీతాలు అనండి వాటిని కొంతవరకూ పొదుపుగా తగ్గింపుచేసి ఈ వ్యయాన్ని తగ్గించి, దానిలో రాబడిని మరల ప్రజానీకానికి ఖర్చుపెడితే ఎంతైనా సమంజసంగా ఉంటుంది ఆ విధానాన్ని ముఖ్యమంత్రిగారు ముందు రాబోయే బడ్జెట్ లలో లక్ష్యంగా పెట్టుకుని, అధికమైన అనవసరమైన వ్యయం తగ్గించి, ప్రజానీకానికి ఉపయోగకరమైనటువంటి పథకాలను తీసుకువచ్చుటకు డబ్బును వినియోగపరచుటకు ప్రయత్నంచేస్తే చాలా బాగుంటుంది తరువాత సభ్యులు చాలామంది సంస్కరణలు సలహాలు సూచించారు ముఖ్యమైన సలహా ఒకటి నేను చెప్పదలచాను రాయలసీమప్రాంతానికి ప్రధానమైనది తుంగభద్రఎగువకాలువకేవలమాత్రం నిర్వివాదమైన విషయం ముఖ్యమంత్రిగారు ఢిల్లీకి వెళ్ళారని వినుచున్నాను నందికొండ project December ఆఖరులోగా శంకుస్థాపన జరుగుతుందని మనం వింటున్నాం తుంగభద్ర ఎగువకాలవకుకూడా ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ గారిచేతనే శంకుస్థాపన జరిగేటట్లు వారు ఆ కార్యక్రమం ఏర్పాటుచేసుకుని, ఎంతో సదాయకంగా ఆంధ్రదేశానికి ముఖ్యమైనటువంటి నందికొండ తుంగభద్ర ఎగువకాలువ ఈ రెండు project లనూ ప్రారంభించేటటువంటి ప్రయత్నం ముఖ్యమంత్రిగారు ఆమోదింపజేసుకుని వస్తారని ఆశిస్తూ ఈ అప్రోప్రియేషను బిల్లును బలపరుస్తున్నాను

Sri M POTHU RAJU —అధ్యక్షా! ప్రభుత్వంయొక్క బిల్లును ప్రణాళికలనూ అన్నిటినీ నేను బలపరుస్తున్నాను గోలుగొండతాలూకా, గూడెంతాలూకా ఇవి రెండూ కలిసియున్నవి గూడెంతాలూకా కేవలం Agency ఆ Agency నుంచి సర్వసామానులుకూడా నరిసీపట్నంమీదుగానే ఈ రాష్ట్రిమంతటికీ వెళుతున్నాయి ఆ దినుసులు రావడానికిన్ని తరువాత Agency నుంచి వెదుళ్ళు, దూలాలు మొదలైన బరువైన సామగ్రిన్ని, నరిసీపట్నంమీదుగానే రావలసియుంటుంది వర్షకాలంలో చాలా ఆటంకంగాయుంది ఎందుచేతనంటే చీడిగుమ్మలపేరున్నూ, మాకవరపాలెంపేరున్నూ, కొత్తకోట పేరున్నూ ఇవన్నీకూడా చాలా పొంగి అడ్డవస్తున్నాయి ఎడ్లకు, బళ్ళకు, ప్రయాణీకులకూ చాలా ఆటంకంగా యున్నది అందుచేత ఈ మూడింటికీ Bridges తయారుచేయించవలసిందని ప్రభుత్వంవారికి మనవి చేస్తున్నాను హరిజనులపట్ల ప్రభుత్వము గౌరవ సభ్యులూ చూపిస్తున్న అభిమానమునకు నా అభినందనములు కాని అది మాటలలోనే కాకుండా హృదయపూర్వకంగా కార్యరూపంలో చూపించవలసినదని ప్రార్థన నరిసీపట్నం హైస్కూలులో రెండు మూడు సంవత్సరముల నుంచి హరిజన విద్యార్థులకు scholarships ఇవ్వడం మానేస్తున్నారు కారణం తెలియదు ముఖ్యమంత్రిగారికి కూడా అర్జీకూడా దాఖలుచేసుకున్నాను ఆ scholarships ఇచ్చే ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను దానిని Government High School చేయవలసిందని కూడా అర్జీ దాఖలు చేసుకున్నాము ఇప్పుడు కూడా మనవి చేస్తున్నాను.

Mr SPEAKER —క్రిందటిసారి ఉపన్యాసములో కూడా చెప్పారండి

Sri M POTHU RAJU —హరిజనులు ఎక్కడ చూచినా చాలా అసహాయకు. వారు ఎక్కడున్నా, ఏ పల్లెల ఇరుకులలోయున్నా Communist లు వెళ్ళి వారికి అనేక విధాలుగా హాయచేసి వారి వద్దనున్న హార్చి వేస్తున్నారు అందువల్ల వాళ్ళు ఎన్నో కష్టాలు పడుతున్నారు ఏ సహాయం కూడా వారికి జరగడం లేదు ఇప్పుడు తోటి పని చేసేవారు వారి మా కులలో పడిపోయి అందువల్ల వారికి సంవత్సరానికిచ్చే రెండుజతల బట్టలు మునిసిపాలిటీవారు గాని, పంచాయితీ బోర్డువారు గాని ఇవ్వడం మానేశారు నరసీపట్నం పంచాయితీకి ఇప్పుడు ఇదివరలోకన్న 4 వంతులు ఎక్కువ ఆదాయం వస్తోంది మా Chairman గారు ఇక్కడ M L A గా ఉన్నారు స్వీపర్లు, తోటిపనిచేసే హరిజనులు చాలా బీదవారు వారికి బట్టలు supply చేయమని ఎన్ని దరఖాస్తులు పెట్టుకున్నా వారి మనస్సు కరగలేదు అందుచేత వారిని ఈ విషయములో బట్టలు ఇచ్చే ఉపకారం చేయవలసిందని ప్రార్థిస్తున్నాను

Mr SPEAKER —The Assembly will now rise for lunch and meet at 2 30 P M

*(After Lunch—2-30 P M )*

Sri VAVILALA GOPALAKRISHNAYYA —అధ్యక్షా ! ఇప్పుడు ప్రతిపాదించినటువంటి ఈ Appropriation Bill మీద చాలా విమర్శనలు చేయవలసిన అవసరమున్నది ఉదాహరణకు మనం ఈ చర్చలలో దాదాపు సగము demands మీదనే చర్చించాము అన్ని విషయాల పైన చర్చించటానికి అవకాశము లేకపోయింది దాన్ని గురించి నిన్న 'Mail" లో కూడా వ్రాశారు మద్రాసు అసెంబ్లీలోను, ఆంధ్ర అసెంబ్లీలోను ఈ demands కు ఎక్కువ time ఇవ్వడంలేదు అన్ని subjects discuss చేయకపోతే అది న్యాయంగా ఉండదేమో అని వ్రాశాడు కనుక ఇకమీదట మనము ఈ విషయములో ఒక సక్రమమైన ఏర్పాటు చేసుకోవలసి యున్నది Constitution లో 15 రోజులు మాత్రమే Demands మీద discuss చేయాలని ఉన్నదనుకోండి ఆవిధంగా ఉన్నప్పటికి, general discussion లోను, వీటిలోను కొంత time adjust చేసుకోవలసిన అవసరమున్నదని చెప్పుతున్నాను

రెండవది ఈ అసెంబ్లీ కార్యవర్గము విధానము మారడం చాలా అవసరమని మనవిచేస్తున్నాను Article 187 ప్రకారం వేరే స్పీకరు అధికారం క్రిందనే శాసనసభ కార్యవర్గం ఏర్పడాలని వున్నది ఆవిధంగా వారే వీరికి కావలసిన Service Rules అవన్నీ ఏర్పాటు చేయవలసిన ఈ పద్ధతిని వెంటనే అమలుకు తీసుకురావలసిందని మంత్రిగారిని కోరుతున్నాను

తరువాత ఇక్కడ Secretariat Buildings కు ఎక్కువడబ్బు ఖర్చుపెట్టారు కాని చేసిన పని సరిగా చేసినట్లులేదు Revenue Secretariat కుపోయి చూస్తే అది crack అయిపోయింది. నీరు కారుతున్నది పెట్టినడబ్బు తక్కువేమీ పెట్టలేదు. ఎక్కువ సొమ్ము పెట్టారే పెట్టారుగాని దానియొక్క వినియోగం చూస్తే చాలా అన్యాయం జరిగినట్లు తోస్తున్నది. దీనినిగురించి వెంటనే విచారణచేయుటానికి అవకాశము లేదు ఈవేళ ఉన్నటు

వంటి Accounts Committee లాగానే Estimates Committee ఏర్పాటు చేయాలని అందరు చెప్పుతున్నారు కనుక ఈ Estimates Committee ఎప్పుడో ఏర్పడడం కాకుండా ఈనాటి Constitution లోను, మన Andhra Act లోను ఇచ్చిన అవకాశాలు తీసుకొని స్పీకరుగారు rules ప్రత్యేకంగా చేయడానికి అవకాశ మున్నది ఆవిధంగా వెంటనే Estimates Committee ని ఏర్పరచడానికి అందరం అంగీకరించే డబ్బు ఖర్చుపెట్టేటప్పుడు అది ఎక్కడెక్కడ ఏవిధంగా ఖర్చుపెట్టబడు తున్నదో దీన్ని మనము ప్రధానంగా చూడవలసియున్నది రెండవది ఆయాపనులకు కేటాయించిన డబ్బు సకాలమున వినియోగింపబడక చాలా lapse అయిపోవడం జరుగు చున్నది ఈ lapse అయిపోయిన మొత్తాలను కూర్చుకోవలసిన అవసరమున్నది Lapse కాకుండా చూస్తామని చెప్పుతున్నారు క్రిందటిసంవత్సరం వేసిన మొత్తాలలో ఈ సంవత్సరంవేసిన మొత్తాలలో ఎంతెంత lapse అవుతున్నదో చూచి ఆవిధంగా lapse కాకుండా వీలైనంత త్వరలో ఖర్చుఅయ్యేటటువంటి విధానాన్ని ఏర్పరచాలని కోరుతున్నాను

తరువాత నందికొండ project ఏర్పరచబోతున్నారు కాని అక్కడ ఉన్నటు వంటి నాగార్జునకొండ శిల్పాలన్నీ ఏమి చేయాలనుకొంటున్నారో తెలియదు దానికి నేనొక సలహాయిస్తున్నాను ఇప్పుడు నందికొండప్రాజెక్టు ఎక్కడైతే కట్టుతున్నారో దానికి దగ్గరనే high level మీద ఒక museum కట్టి అందులో ఈ శిల్పాలన్నీ ఉంచినట్లయితే అటు సాగర్ చూడడానికిని, ఇటు దీనిని చూడడానికిని వీలవుతుంది నాగార్జునసాగర్ అన్నప్పుడు నాగార్జునుడు ఇక్కడనే ఉండినాడనుటకు నిదర్శనంగా ఇవన్నీ ఉన్నాయని చెప్పడానికి వీలుగా ఉంటుంది కాబట్టి అక్కడ museum కట్ట వలసిన అవసరమున్నదనే విషయం మీ అంగీకృష్టికి తెస్తున్నాను

The Hon Sri B GOPALA REDDI — అది flouting museum గా ఉంటుందేమో

Sri VAVILALA GOPALAKRISHNAYYA —Flouting museum ఎందుకవుతుందండి ఇప్పుడు అక్కడ buildings కట్టడంలేదా! అవన్నీ flouting అయితే, ఇది కూడ flouting అవుతుందని చెప్పవచ్చు అందుకు నా అభ్యంతరం ఏమి లేదు కనుక దీనిని నందికొండమీద భవనాలు నిర్మించుట high level లో పెట్టినట్లయితే చుట్టుప్రక్కల యాత్ర చేయడానికి కూడ అవకాశ ముంటుంది

Mr SPEAKER — There is no provision for the museum

Sri VAVILALA GOPALAKRISHNAYYA — ఇది నందికొండ ప్రాజెక్టుకు allied subject గాబట్టి దీనివిషయం చెప్పుతున్నాను కనుక ఆవిధంగా ఒక museum అక్కడ ఏర్పరచాలని కోరుతున్నాను

తరువాత ముఖ్యంగా ఈ capital పట్టణంలో, చాలా ఎక్కువగా ఖర్చుపెట్టి ఏవేవో కట్టిస్తున్నారు డబ్బు చాలా అవసరము అవుతున్నది ఈ సందర్భంలో విశాలాంధ్ర వస్తుందనేది దృష్టిలో ఉంచుకొని, ప్రస్తుతానికి ఇక్కడ ఖర్చుపెట్టడం ఇంత టితో ఆపివేసి విశాలాంధ్ర వచ్చినతరువాత ఈ సమస్య తేల్చుకొందామని మనవిచేస్తా

ఈ account లో మాత్రము leakage, సాంబాళ్లు లేకుండా ఉండేటట్లు చూస్తారని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను

Sri M RAJESWARA RAO — అధ్యక్షా! ఈ Appropriation Bill ను పురస్కరించుకొని రెండువిషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకొని రాదలచాను మొట్టమొదట, ఈనాడు వివిధశాఖలకు ఈ బడ్జెట్టులో కేటాయించిన డబ్బును ఆమోదించి, దాన్ని సక్రమంగా ఖర్చుపెట్టవలసినటువంటి బాధ్యతను ప్రభుత్వమునకు ఈ శాసనసభ అప్పగించింది కనుక ఆ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహిస్తారని, అనవసరంగా డబ్బు ఎక్కువ ఖర్చుచేసి, మళ్ళీ అనవసరంగా supplementary demands లో ఎక్కువ మొత్తాలు తీసుకురాకుండా ఉంటారని మేము ఆశిస్తున్నాము అయితే ఇప్పుడు sanction చేశామని చెప్పి, అనవసరంగా ఖర్చుపెట్టకుండా, ముఖ్యంగా మంత్రులు తమ పర్యటనలను సాధ్యమైనంతవరకు తగ్గించుకొని, ఆవిధంగా తాము అనవసరమైన ఖర్చును తగ్గించుటకు ప్రయత్నం చేస్తున్నారనే అభిప్రాయాన్ని ప్రజలకు కలుగచేస్తారని ఆశిస్తున్నాను ఈ బడ్జెట్టులో కేటాయించిన డబ్బును వివిధశాఖలలోను సక్రమంగా వినియోగించాలంటే Services ను, reorganise చేయాలని, ఈ ఉద్యోగస్తుల పునర్వ్యవస్థీకరణకోసం ప్రభుత్వం సరియైనటువంటి చర్యలు తీసుకోవాలని పదేపదే మేము మనవిచేస్తూ వచ్చాము దాన్నిగురించి మద్రాసు ప్రభుత్వము ఒక కమిటీని వేశారు వారి నివేదికను ఈరోజు పత్రికలలో ప్రకటించినట్లు చూశాను దీనిని ప్రభుత్వము కొంచెము జాగ్రత్తగా ఆలోచించాలి దీనికి అయిదురకాల సిద్ధాంతాలతో కూడుకొన్నటువంటి ఒక పంచశీలను ప్రభుత్వానికి నేను సూచించాలని అనుకొంటున్నాను మొట్టమొదట, మనము ఇప్పుడు ఈ Services reorganise చేయడంలో పెద్ద ఇబ్బంది ఉన్నది ఒకప్రక్కన 52 1 percent ఉద్యోగస్తులమీద ఖర్చుపెడుతున్నామని, ప్రతి 175 మందికి ఒక Government servant ఉన్నాడని, అందుచేత మనకు ఖర్చు ఎక్కువవుతున్నది, తగ్గించాలని మన శాసనసభ్యులు చెప్పుతూఉండగా, మరోప్రక్కన మాకు జీతాలు చాలటంలేదని, ఉద్యోగస్తులు తక్కువగా ఉన్నారని వారు చెప్పటం, ఇదంతా ఒక paradox గా కన్పిస్తున్నది నిజంగా ఈనాడు వారి జీతాలను అభివృద్ధిచేయకపోతే, మన Services లో efficiency expect చేయలేము మద్రాసుప్రభుత్వంవారు నియమించిన కమిటీవారుకూడ ఇదేసంగతి వెలిబుచ్చారు కనుక, జీతాలనుఅభివృద్ధిచేయడం ద్వారానే అసలు ఇప్పుడున్న ఖర్చును తగ్గించుకోడానికి వీలైన మార్గమున్నదా అని మన ప్రభుత్వము కొంత జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరమున్నదనుకొంటూను ఈ సందర్భములో, మనము ఇప్పుడు అనుసరించుచున్న Tottenham System మంచిదే అయినప్పటికినీ, ఆధునికపద్ధతులకు సరిపోయేటటువంటి విధముగా దానిలో కొన్ని మార్పులు తీసుకురావలెనని ప్రభుత్వానికి సూచిస్తున్నాను రెండవది, ఇప్పుడున్నటువంటి Gagetted officers, పెద్దపెద్ద ఉద్యోగస్తులు తమ బాధ్యతలను సక్రమముగా నిర్వర్తించాలి ఎక్కువ జీతాలు తీసుకొనేవారు ఎక్కువబాధ్యతలు కలిగి ఎక్కువ ప్రజాసేవ చేయాలనే అభిప్రాయముతో పరిపాలనచేసే విధానాన్ని ప్రభుత్వమువారు వారికి నేర్పించాలని, ప్రబోధించాలని సూచిస్తున్నాను ఇప్పుడు చాలవరకు, 2, 3 వేలు తీసుకొనే గవర్నమెంటు ఆఫీసర్లు తాము ఆఫీసర్లుగనే భావించుకొని, ప్రజాసేవకులనే విషయం మరచిపోయారేమోనని నేను అభిప్రాయపడుతూఉంటాను కాబట్టి ఎక్కువగా జీతాలుతీసుకొనే కొద్ది, ప్రజలకు ఎక్కువసేవచేసే బాధ్యత వారికి ఉన్నదని గుర్తించాలి.

అప్పుడే ఈ ప్రభుత్వానికిన్నీ, ప్రజలకున్నూ కొంచెము సమన్వయం కుదురుతుందని మనవిచేస్తున్నాను

ఇక మూడవ విషయము మనవి చేస్తాను ఇప్పుడువున్న ఖర్చులను తగ్గించుకోవటానికి 50% కాకపోయినప్పటికీ కనీసము 25% వరకైనా తగ్గించుకోవాలంటే యిప్పుడు వున్న ఉద్యోగస్థులను 50% వరకూ అయినా తగ్గించాలి ఆ విధంగా చేసినప్పుడు పెద్ద ఉద్యోగస్థుల బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించ చున్నప్పుడు, చిన్న ఉద్యోగులను తగ్గించటానికి వీలవుతుంది ఇది కాకుండా కొన్ని డిపార్టుమెంట్సులో కేవలము పోస్టాఫీసు మాదిరిగా పనిచేస్తున్నటువంటి వారిని తగ్గించాలి ఉదాహరణకు రివిన్యూబోర్డు ఒకటి వున్నది తరువాత డిప్యూటీ కలెక్టర్లు, పోలీసు డిపార్టుమెంటులో డిప్యూటీ సూపరింటెండెంట్లు, వీరందరూ కూడా అనవసరమేనని అంటున్నాను రివెన్యూబోర్డు వుంచటమువల్ల ప్రభుత్వానికి ఎంతో దుబారా ఖర్చు అవుతున్నది వీటినన్నింటినీ తగ్గించటము ద్వారా, పూర్తిగా essential services లు effect కాకుండా, 50% వరకు retrench చేయటానికి అవకాశాలు వున్నవి

తరువాత ప్రభుత్వ కార్యకలాపాలలో లంచగొండి తనము పూర్తిగా పెరిగిపోయింది ప్రజలకు ఉద్యోగస్థులకు సన్నిహిత సంబంధము ఏర్పడాలి లంచగొండితనము పెరిగిందంటే దానికి ముఖ్య కారణము ప్రభుత్వము వారికి జీతాలు చాలకపోవడం వల్లనే అంటున్నారు ఈ జీతాలు పెంచటము విషయములో మనకు Central pay Commission వారి సిఫార్సులు వుండనే వున్నవి ఈనాడు మద్రాసువారు యిచ్చిన రిపోర్టులో కూడా వారి జీతాలు పెంచాలనే సూచించారు కాబట్టి మనము 50% వరకూ Services ను retrench చేసి మిగిలిన వారికి 5% వరకూ కాకపోయినా 20% వరకైనా జీతాలు increase చేయవలసి వుంటుందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను

తరువాత ప్రజలకు ప్రభుత్వోద్యోగస్థులకు మధ్య ఒక రకమైన సమన్వయము కుదరటానికి ప్రభుత్వము కృషి చేయవలసివున్నది ఇది యే రూపములో వుండాలనేది నేను సాహసించి చెప్పలేక పోయినప్పటికినీ ఒక్కొక్క జిల్లాను ఒక్కొక్క unit గా పెట్టుకుని develop చేస్తే దేశము వృద్ధిలోకి వస్తుంది అంతే కాకుండా మనకు వున్న terms of reference change చేసి ఉద్యోగస్థులకును, ప్రజలకునూ సన్నిహిత సంబంధము కుదిరిననాడే, administration బాగుపడుతుంది నేను చెప్పిన అయిదు సిద్ధాంతాలను ప్రభుత్వమువారు జాగ్రత్తగా పరిశీలించాలని మనవి చేస్తున్నాను జిల్లాలలో ఒక అనధికార సంఘాన్ని వేయండి దానిద్వారా ప్రభుత్వ కార్యకలాపాలను పరిశీలింప చేయండి అప్పుడు ప్రభుత్వ కార్యకలాపాలు సక్రమంగా నడపగలవు ప్రభుత్వముయొక్క డబ్బుకూడా సక్రమంగా వినియోగపడుతుంది దుర్వినియోగము లేకుండాచూడవచ్చు ప్రభుత్వము వారు తలపెట్టిన ఈ planning సక్రమంగా నడపవలెనంటే నాయొక్క సూచనలను ప్రభుత్వము గమనించవలసిందిగా కోరుతున్నాను

ఈ నాడు ముఖ్యమంత్రిగారి జన్మదినోత్సవము కాబట్టి సభ్యులందరు అభిప్రాయ భేదాలు లేకుండా యీ బిల్లును ఏకగ్రీవంగా ఆమోదించ వలసిందిగా సభ్యులందరికి కోరుతూ సెలవు తీసుకుంటున్నాను

Sri P VENKATASUBBAYYA — అధ్యక్షా! ఈనాడు యీ Appropriation బిల్లును పురస్కరించుకొని, నేను రెండు మూడు విషయాలు మాత్రము తెలియజేయ దలచుకున్నాను ఈ appropriation bill ప్రకారము 67,10,86,600 రూపాయలు ప్రభుత్వము వారి స్వాధీనము చేశాము ఈ డబ్బును ఖర్చు చేయడానికి Departmental Heads వుంటున్నారు ఆయా డిపార్టుమెంట్సుకు allot చేసిన సొమ్ము, దానియొక్క ఖర్చు అంతా వారే గమనిస్తుంటారు అయితే గత సంవత్సరము అంతములోగా, బడ్జెటు ప్రకారము అందజేసిన మొత్తాలను సరిగా ఖర్చు చేశారా లేదా అనే దాన్ని పరిశీలించుటకు శాసనసభ తరఫున check చేయటానికి సాధారణముగా ప్రతిసంవత్సరమూ కూడా ఒక Accounts Committee ని నియమించడము జరుగుచున్నది ఇది ఒక సంవత్సరానికి ఒక పర్యాయము అనే కాదు, కనీసము రెండు సంవత్సరాల కొక పర్యాయము అయినా ఇటువంటి కమిటీ సమావేశమై, యీ ప్రభుత్వమువారు చేసిన ఖర్చులను సక్రమంగా చేశారా లేదా అనేది పరిశీలన చేయవలసి వున్నది ప్రభుత్వ ఖర్చులలో ఏమైనా లోపాలు వుంటే, అవన్నీ ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావటానికి సరియైన అవకాశము వుండాలి అందువల్ల యీ కమిటీని యింతవరకు వేయకపోయినందువల్ల, గత సంవత్సరము ప్రభుత్వము వారు చేసిన ఖర్చులు పరిశీలించే అవకాశము లేకుండా పోయింది కాబట్టి యీ Accounts Committee ని వెంటనే ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను

ఇక రెండవ విషయము యేమిటంటే, యీ డిమాండ్ల క్రింద allot చేయబడిన డబ్బు అంతయు ఖర్చుపెట్టటానికి ప్రభుత్వము తరఫున పనిచేస్తున్న Departmental Heads వుంటున్నారు వారు సరిగా యీ మొత్తాలను ఖర్చుచేయకపోవడమువల్ల సంవత్సరాంతములో మొత్తాలు lapse కావడము కూడా జరుగుచున్నది అటువంటివి lapse కాకుండా చూడాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇందుకుగాను ఒక ఉదహారణ చెప్పదలచాను

పది లక్షల రూపాయలు House sites ను acquire చేయటానికి Harijan Welfare Fund క్రింద కేటాయించారు అందులో రెండు లక్షలు మాత్రమే ఖర్చు చేయబడ్డవి మిగతా 8 లక్షలున్నూ, 1955-56 బడ్జటులో చూపబడలేదు కాబట్టి యీ September నెల ఆఖరుకు యీ 8 లక్షలున్నూ ఖర్చు చేయవలసి వుంటుంది ఈవిధంగా యీసొమ్ము ఖర్చుచేయకపోతే, యిప్పుడు రానున్న రెండు నెలలలోగా ఆ సొమ్ము అంతయూ ఖర్చుచేయడము అసంభవ మవుతుంది కాబట్టి యీ విషయము ప్రభుత్వాధికారులకు తెలియజేసి యీ సొమ్ము అంతా కూడా రానున్న రెండు మాసాలలో ఖర్చు చేయుటకు ప్రభుత్వమువారు తగు చర్య తీసుకోమని కోరుతున్నాను

ఇక Co operative Department ద్వారా ఎక్కువ డబ్బు కేటాయింపు చేశారు ఈ కేటాయింపు చేయడములో ఎక్కువ అధికార్లను నియమించడము జరుగుచున్నది అక్కడ సొసైటీలలో పనిమాత్రం కాగితంగా జరుగుచున్నట్లు కనబడుతున్నది కాని ఉద్యోగస్థుల జీతాల క్రింద ఎక్కువ ఖర్చు అవుతున్నప్పుడు కో-ఆపరేటివ్ సంస్థల పని సరిగా జరిగేటట్లు చూడవలసిందిగా ప్రభుత్వము చూడాల్సివున్నది ఈ విషయము పరిశీలించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను తరువాత శాంక్షనుచేసిన మొత్తము lapse కాకుండా చూడాలని అంటూ యింతటితో విరమిస్తున్నాను,

5th August 1955]

Sri P SUNDARAYYA —అధ్యక్షా ఈనాడు Appropriation Bill మీద మాట్లాడేటప్పుడు సాధారణంగా Budget demand మీద general చర్చ అనేది 2, 3 నెల రోజులుగా జరిపాము ఆ విషయాల అన్నిటి లోపలకు పోయి చర్చించటానికంటే, వీటి యొక్క సారాంశమును బట్టి, యీ డబ్బు యివ్వడము సరియైనదేనా అనే దృష్టితోనే మాట్లాడవలసి వుంటుంది ఆ వివరాలన్నిటిలోకి నేను వెళ్ళదలచుకోలేదు ఈ సొమ్ము యివ్వటానికి నాకు మాత్రము మనస్సు రావడములేదు కాని ఆవిధంగా యీ సొమ్ము ఆ బడ్జెట్టు యందు, నేను ఒకటి రెండు విషయాలను గురించి చెప్పవలసి వుంటుంది ఈ శాసనసభా కార్యక్రమాన్ని చాలా తక్కువయంది సిబ్బందితో over time పని చేస్తూ ప్రతిదినము కూడా మామూలు టైముగానే కాకుండా యింకా ఒకటి రెండు గంటలు ఎక్కువగానే పనిచేశారు కొన్ని సందర్భాలలో యింకా ముందుగానే పని ప్రారంభించి, తరువాత శాసనసభ చాలా ఆలస్యముగా వెళ్ళినా యీ కార్యక్రమము పూర్తిచేసి అందుకు గాను అందరికి యిక్కడ పనిచేస్తున్న సిబ్బందికి నా కృతజ్ఞతాభివాదాలు అర్పిస్తున్నాను అంతేకాక పూర్వము యీ విధంగా over time staff work చేస్తున్నప్పుడు వారికి కనీసము over time rates యీ చిన్న జీతాలవారికి టెంపొరరి staff అయినట్లు యిస్తూవుండేవారు ఆ రీతిగా యిక్కడ వీరికి కూడా యిస్తారని నేను ఆశిస్తున్నాను

తరువాత శాసనసభ సెక్రెటేరియట్ ను ఒక స్వతంత్ర శాఖగా చేయడము చాలా ప్రధాన శాఖగా నిర్వర్తింపబడాలి ఈ శాఖ అంతా కూడా Speaker గారి యాజమాన్యాన నిర్వర్తింపబడాలి ఈ విషయము Speaker గారు ముఖ్యమంత్రి గారితో సంప్రదించి దీన్ని independent secretariat గా చేయాలని అంటున్నాను ఈ శాఖ యితర ప్రభుత్వశాఖల మీద చాలా మట్టుకు ఆధారపడి వుంటున్నది ఈశాఖ ప్రభుత్వానికి కావలసిన శాసనము తయారు చేసే శాఖ ప్రభుత్వ శాఖలు executives క్రింద వుంటాయి ఇప్పుడు వుండే పద్ధతి ప్రకారము ఈ శాఖ Parliamentary సాంప్రదాయాలకు విరుద్ధముగా వున్నది కనుక దీన్ని త్వరలో మార్పించటానికి ప్రయత్నించవలసిందిగా అధ్యక్షులవారిని కోరుతున్నాను

ఈనాడు బడ్జెట్టు చర్చలలో కనబడని పెద్దలోపము యేమిటంటే, యిక్కడ శాసనసభ ఎదుట గతసంవత్సరపు రిపోర్టుకూడా లేదు ఇప్పటికి ఆంధ్రప్రభుత్వము యేర్పడి దాదాపు రెండుసంవత్సరాలు కావస్తున్నది శాసనసభా కార్యక్రమము ప్రభుత్వముయొక్క రిపోర్టులు లేకుండానే జరుగుచున్నది ఇకముందు అయినా ప్రభుత్వముయొక్క రిపోర్టులు, ప్రతి సంవత్సరము అంతానికి సభ్యులందరికీ వీలు అయినంతముందుగా అందజేసే పద్ధతి వుండాలి అంటే బడ్జెట్టును మార్చి నెలలో ప్రవేశపెట్టేటట్లయితే, క్యాలెండరు సంవత్సరము ఆఖరువరకూ తయారైన లెక్కల యొక్క వివరాలు అన్నీకూడా సభ్యులకు అందజేస్తే, అవి బడ్జెట్టుచర్చలలో తప్పకుండా యిదివరకటికంటే ఎక్కువ వుపయోగకరంగా వుంటాయి శాసన సభ్యులు చెప్పినవన్నీ ప్రత్యేకంగా నోటుచేసుకొని, దానిమీద ప్రభుత్వము యేమేమి చర్య తీసుకున్నది దీన్ని ఆ concerned సభ్యులకు తెలియజేయాలి ఏదైనా జనరల్ సమస్య వస్తే, ఆ విషయములో శాసన సభ్యుల కందరకూ తెలియజేయవలసిన సంగతులు

వుంటే, అవి అందరికీ కూడా తెలియజేయాలనే పద్ధతి పెట్టాల్సివుంది. ఇది పార్లమెంటులో జరిగే పద్ధతి. ఆవిధంగా చేయకపోతే అది శాసనసభ అని అనిపించుకోదు. ఏదో ఒక అలంకారసభక్రింద వుంటున్నదని అనిపించుకొంటుంది. మనం ఎందరము ప్రజాప్రతినిధులము గనుక, మనము యిక్కడ సభలో సమావేశము అవుతున్నాము. మనము యిక్కడ చర్చించిన విషయాలన్నీ కూడా యింకా ఎన్నాళ్ళకు అచ్చు రూపములోగాని cyclostyle రూపములోగాని వస్తుందో తెలియదు. పార్లమెంటులో ఏరోజున జరిగిన కార్యక్రమమంతయు, ప్రశ్నలు, వాటికి జవాబులు, అన్నీ కూడా మరునాటిఉదయమునకే cyclostyle copy రూపములో గాని, అచ్చురూపములో గాని, సభ్యులకు అందజేయబడుతుంది. ఆ క్రిందటి దినము యొక్క కార్యకలాపము అంతయూ, కాపీలరూపములో తయారై, మరునాటి వుదయానికల్లా, లాబీలలోను, కార్యదర్శుల చేతుల్లోను వుంటాయి. అటువంటి యేర్పాటు అక్కడ పార్లమెంటులో జరుగుచున్నది. కాబట్టి అటువంటి యేర్పాటు యిక్కడ శాసనసభలో కూడా జరిగేటట్టు చూడాలని నా అభిప్రాయము. ఆవిధంగా జరగటానికి యింకను అవసరమైన సిబ్బందినిగాని, రిపోర్టర్లను గాని, అదనంగా వేసి, యిటువంటి ఏర్పాటులు చేయవలసివుంటుంది. ఈ సభకు సంబంధించిన proceedings అన్నీకూడా తెలుగులోనే వస్తే మంచిది.

తరువాత శాసనసభ్యుల జీతాలను గురించి విచారిస్తే, యిదివరకు జరిగే పాత పద్ధతి పోవాలి. ప్రస్తుతము జరిగేది యే విధంగా వున్నదంటే, ఉద్యోగస్థులు తరువాతనే యీ శాసనసభ్యులు అనే దృక్పథము పోవాలి. ప్రజాప్రతినిధులు అన్నతరువాత, పార్లమెంటు సభ్యులు గాని, శాసనసభ్యులుగాని, వారితరువాతనే ప్రభుత్వోద్యోగస్థులు అనే దృక్పథము రావాలి. కాబట్టి యిప్పుడు జరిగే పద్ధతిలో కాకుండా ఢిల్లీ ప్రభుత్వానికి తెలియపరచి అయినా యిందులో మార్పు తీసుకొనిరావలసిందిగా Speaker గారిని, ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత ప్రజల సమస్యలు ప్రజాప్రతినిధుల ద్వారా ఎప్పటికప్పుడు ప్రభుత్వ దృష్టికి తేవటానికి యిక్కడ శాసనసభ సమావేశమవుతున్నదని ప్రజలు గుర్తించటానికి, సంవత్సరములో కనీసము నాలుగుపర్యాయములైనను సమావేశము జరపాలి. మార్చినెలలో సమావేశము అయినతరువాత, జూలై, సెప్టెంబరు, డిశంబరు, తరువాత మరల సంవత్సరము మార్చినెలలో సమావేశము జరగాలి. ఈ విధంగా చేస్తేనే యిక్కడ శాసనసభ సమావేశము యీ నెలలో జరగబోతున్నదన్న సంగతి ప్రజలకు తెలియాలి. ఆ విధంగా చేయకుండా, యీ శాసనసభ ఎప్పుడు సమావేశమవుతుందో కూడా ప్రజలకు తెలియకపోతే, మనము ప్రజలకు దూరమవుతాము. కాబట్టి దానికి తగిన చర్య అవసరమని ప్రభుత్వమువారికి తెలియజేస్తున్నాను. ఇప్పుడు మనకు బెంగాల్ శాసనసభ సమావేశముసంగతి మనకుఅనుభవమునకు వస్తున్నది. అక్కడ శాసనసభ సంవత్సరానికి రెండుపర్యాయములు అయినను జరగడంలేదు. అదికూడా అతి కష్టముమీద B C Roy గారు సమావేశాలు జరుపుతున్నారు. ఆ విధంగా మనము జరపకుండా వుంటామని అనుకుంటున్నాను. తరువాత శాసనసభా వ్యవహారములన్నీ సాధ్యమైనంతవరకూ తెలుగులోనే జరపవలసివుంటుంది. మనకు ఆంధ్రరాష్ట్రము కావాలని కోరి దానికి సూచనగా మనము యీ సభా కార్యకలాపాలను తెలుగులోనే జరిపించుకోవాలి. ఆ విధంగా జరగకపోతే, దానికి అర్థము, అర్థములేకుండా పోతుందని అంటున్నాను.

ముఖ్య విధానముగా జరుగుతున్నది. దీనికి పరిష్కార మార్గము ఏమిటి అని పదే పదే అడుగుతారు ప్రభుత్వమే ఈ వస్తుపానీయాలన్నింటిని సరకలకొనుకొని వాటిలో ఎంతవరకు మత్తును తగ్గించడానికి వీలయితే అంతవరకు మత్తుపదార్థాన్ని తగ్గించి అమ్మింది డబ్బు వస్తుందా, గాదా అనేది ప్రధాన సమస్యకాదు విపరీతంగా వర్జించి తిరిగి వాళ్ళకు ఆ వృత్తులలోచేర్చి వికల్ప చేయండి ఇదివరకు కాంగ్రెసు వారు "ప్రచారము చేయండి, విజ్ఞానాభివృద్ధి కలుగచేయండి" అన్నారు ఇప్పుడు అదికాకుండా సైన్యలోనేసి పోగొడుతున్నారు ఈ స్థితిపోవాలి

భవనాలు రోడ్లు నిర్మిస్తామంటున్నారు కంట్రాక్టర్లకు వచ్చేవిలాభాలు ఇళ్ళలో వున్నవాళ్ళకు అవస్థ వర్షాలుకురిసినప్పుడు ఈ నీరుఅంతా ఇండ్లలోనే వుంటుంది రోడ్లు కట్టలు తెగి నీరు ప్రవహిస్తూనేవుంటుంది అంతేకాదు పదికగదులలోనుంచి flush out చేసుకుపోయి, flust out నుంచి గదుల్లోకి నీరు కారేట్లు కట్టేటటువంటి ఇంజనీరు నిపుణులతో రిపేరుగానూ జరుగుతున్నాయి నేను నా అనుభవమువల్ల చెబుతున్నాను

విద్యసంగతిచూస్తే ప్రాథమికవిద్య వరి 25 యేండ్లకన్నా మన ప్రజానీకానికి అందుతుందాఅంటే అటువంటి ఆశామాత్రం కల్పించడములేదు బస్టీలలోగాని, ప్రణాళికలోగాని అది ఎక్కడా కల్పించడములేదు వయోజనులు మాత్రం నిరంతరకృషుంధనులుగా వుండడము తప్పితే వాళ్ళకుమాత్రం విద్యచెప్పడము, అక్షరాభ్యాసము చేయించేటటువంటి ఆస్కారము ఎక్కడా లేదు అయితే హిందీ ఆంగ్లంగీర్వాణాలు మాత్రం చదువుకే తప్పదు 11 యేండ్ల బాలబాలికలకు మిడిల్ విద్య అన్న పేరుతో చదువులు సున్నచేసి వృత్తులు నేర్చుకో మంటున్నారు పనులు నేర్చుకోవాలి అంటున్నారు 14 యేండ్లవరకు ముందు ఉచితవిద్య ఇవ్వండి ఆతరువాత ఏ వృత్తిఅయినా నేర్పండి అప్పుడు వుపయోగము వుంటుందిగాని అయిదుయేండ్లనుండి 11 యేండ్లవరకు వీరు వృత్తులు నేర్పి వాళ్ళచేత పని చేయించడము అనే పథకము ఏరీతిగా కూడా సరియైనది కాదు విశ్వవిద్యాలయాల్లో తెలుగులో బోధించడము సాధ్యంకాదు ఇంగ్లీషులోనే బోధించాల్సివుంటుంది అంటున్నారు తెలుగులో చెప్పాలంటే అది అసంభవము దాన్ని నిదానముగా చూచుకోవలసివుంటుందని అంటున్నారు పోతే ఉపాధ్యాయుల సంగతి చూస్తే వారు చకోరపక్షులలాగా కనీసం జీవితంకోసం చెట్లక్రింద, వర్షానికి ఎదురు చూస్తూ కూర్చోవలసినది తప్పితే, వేరుగతిలేదు అయితే ఎన్నేళ్ళవరకు ఎదురుచూడాలో అంతేమీ కనిపించడములేదు

కనీసము ప్రాథమిక పాఠశాలల విషయములు చెప్పినప్పుడు ఆలోచిస్తాము అంటున్నారు అనేకవిషయాలు ఆలోచిస్తాము అంటున్నారు మంత్రిగారు ఆరోగ్యము వైద్యం చూచినట్లయితే అందరికి కావలసినదే కాని డబ్బులేదు కాని ఎవరిఇష్టమువచ్చినచోట వైద్యము వారి ఓపిక ఉన్నంతవరకు fees పుచ్చుకొని ప్రజలకు చేయవచ్చు కాని వీరందరికి తర్ఫీదుఇచ్చి శాస్త్రీయచికిత్స చేయించుటకు పూనుకోలేదు జాతీయ ఆరోగ్యప్రణాళిక కనుచూపుమేరలో లేదు అటువంటి మన భారతదేశములో అది ఆచరణ సాధ్యముకాదు మంత్రిగారు అవసరముఅంటున్నారు ప్రకృతి పనిచేస్తుంది అంటున్నారు లేకపోతే పూర్వ అనుభవము సరిపోతుంది దానినిగురించి కృషిచేయుట ఎందుకు అంటున్నారు మలేరియా ఉన్నది అది అందరికి వస్తున్నది ఎంతోకాలముగా ఉంటున్నది దానినిగురించి మనము control చేసే విధానము యేదీలేదు.

తరువాత మంచినీటి సౌకర్యములు, మురుగునీరు స్కీములు, మరుగుదొడ్డి సౌకర్యములు కల్పించడము సగముడబ్బు యిస్తేగాని సాధ్యముకాదు అంటారు ఇంకా వెనుకబడిన జాతులసంగతి చూస్తామంటే వెనుకబడినజాతుల కులాలు, హరిజనుల కోసము క్రొత్తగా సామాజిక అభ్యుదయము అను పేరుతో పని ఆరంభిస్తున్నాము, క్రొత్తపద్ధతులతో పునర్నిర్మాణము చేస్తున్నాము అంటారు క్రొత్తపద్ధతి ఏమంటే కూలీలకు ఈ వెనుకబడ్డవారికి hostels, ఇండ్లు, ఎండ్లు ఏర్పాటుచేస్తున్నాము అంటున్నారు అయితే ఎప్పుడు చేస్తారు అంటే ముందు మా రాజకీయబాధలు సమస్యలలో మునిగిపోయి ఉన్నాము వాళ్ళసమస్య తేలినతరువాత వాళ్ళకు పోగా మిగిలినది ఏమైనా ఉంటే అది అంతా మీకేనని చెప్పుచున్నారు ఇంకా గట్టిగా అడిగితే మాలమాదిగలు అంతా కలసి మీరందరు ఒక్కబావిలో నీరుత్రాగండి మీరు కలువకుండా మాతోవచ్చి కలవాలంటారే! ఇదేమి న్యాయము అనిచెప్పి కాంగ్రెసు మంత్రివర్గములోవారు ముసిముసి నవ్వులు నవ్వుచూ వేళాకోళముచేయుట మొదలుపెట్టుచున్నారు ఇది క్షమించరాని విషయము, ఎంతోకాలమునుంచి వారి అంటరానితనమును చూస్తూ వీరి సౌభాగ్యము కొరకు చేయవలసిన పని చేయకుండా గట్టిగా అడిగితే మీరుమీరు కలవండి ఒకటే బావిలో నీరు త్రాగండి, అదిలేకుండా మీకు సమాన హక్కులు యివ్వాలని కోరుట సమంజసముకాదు, అని కొంతమంది కాంగ్రెసుసభ్యులు చెప్పడము సరియైనది కాదు

ఇక పరిపాలనా యంత్రము చూస్తే దానిలో పెద్ద మార్పు అవసరములేదు ఎందుకంటే చాలా అనుభవజ్ఞులైనటువంటివారు చాలాకాలముగా rules చేశారు ఆ rules తో బండీ నడుస్తోంది దానిని మార్పు చేస్తే తలక్రిందులు అవుతుంది అందుచేత అది అట్లా ఉండవలసినదే అంటున్నారు అసలు నిజముగా ప్రజలపై పెత్తనము చేయునది ప్రభుత్వము అందుకే క్రిందనుంచి పైవరకు ఉద్యోగస్తులను ఏర్పాటు చేసి నడుపుతూ ఉన్నది దీనికి అట్లాకాకుండా ప్రజలచేత ఎన్నికైన కమిటీలు క్రిందనుంచి పైవరకు ఉద్యోగస్తుల మీద అజమాయిషీ చేస్తూ, ఉద్యోగస్తులు వారి క్రింద పనిచేయాలని అన్నారే, అప్పుడు అది ప్రభుత్వము కాదు ప్రజాస్వామికము కాదు అని మంత్రివర్గము చెబుతున్నారు అందుచేత ఇంగ్లీషులో విద్య, ఇంగ్లీషులోనే పరిపాలనా చేస్తున్నారు తెలుగులో చేయాలంటే typewriters లేవు, పర్యాయపదములు దొరకవు, పుస్తకములు లేవు, shorthand reporters లేరు ఇదిచాలా అసంభవమైన కోరిక అంటూ, క్రమేణా క్రమేణా ఎప్పటికైనా చూస్తాము, చేస్తాము అని మంత్రులు సమాధానము చెప్పుచున్నారు పెద్ద ఉద్యోగస్థుల విషయం చూస్తే ప్రభుత్వ విధానము ఎట్లా ఉండాలి? పెద్ద ఉద్యోగస్తులకు పెద్ద జీతములు, చిన్న ఉద్యోగస్తులకు చిన్న జీతములు లేకపోతే తారతమ్యము ఎట్లుంటది? చిన్న ఉద్యోగస్తులకు చిన్న జీతములు తీసుకొని ఎట్లా బ్రతుకుతారంటే ప్రజలవద్దనుండి ఓటికొద్దీ మామూలు పుచ్చుకోవచ్చు పెద్ద చిన్నల మధ్య తారతమ్యము లేకపోతే మన భారత నాగరికతకు చాలా అన్యాయము కదా? అందుచేత పెద్ద ఉద్యోగస్తులకు పెద్ద జీతములు, చిన్న ఉద్యోగస్తులకు చిన్న జీతాలు, అందువల్లనే వెట్టికి 10/, బంట్రోతుకు 30/ గవర్నరుకు 30,000/ ఖర్చు ప్రతిసాలలోనూ ఖర్చు పెడుతున్నాము ఇక ప్రభుత్వము ఎట్లా ఉండాలంటే రాజఠీవి, రాజభవనములు ఉండాలి రాజపాలకులు ఉండాలి, రాజలాంఛనములు ఉండాలి రాజవీధులలో రాజరథములు

పెరుగుతూ ఉంటే రహదారులలో రద్దీ జరుగకుండా రక్షకభటులు కాపలాకాసి ఉండాలి. ఇది మా రాజనీతి ఈ పైమాదిరిగా ఉంది

ఇక న్యాయపరిపాలనకు police శాఖ courts జైళ్ళు చూస్తే 107, 109, 110, 151 సెక్షనులు పెట్టి ప్రజలమీద కేసులు పెట్టి (ఏ పోలీసు అయినాసరే) జిల్లాలు మీరు చూడలేదేమోనని జిల్లాలో నాలుగు వీధులు త్రిప్పి త్రిప్పి వేసారి విడిపిస్తారు Police ల arrest కు ఏవిధమైన అడ్డంకు ఉండకూడదు Arrest చేసినతర్వాత కొన్ని నెలలవరకు charge sheets వుండవు Charge sheet పెట్టినకొన్ని నెలలకుగాని కేసులు పూర్తిగావు Civil కేసులు చూస్తే అవికొన్ని సంవత్సరములు జరిగితే కాని అవి civil కేసులు అనిపించుకొనవు ఇది న్యాయపాలన పద్ధతి కాంగ్రెసు కాలంలో మనము జైళ్ళలో ఉన్నప్పుడు ration ఉండేది ఆ ప్రకారం ఆ రోజులలో jailors wardens అన్నీ కాజేసే వారు Contractors సరైన వస్తువులు సరఫరా చేసేవారు కాదు అప్పుడు మా కాంగ్రెసువారు చెప్పింది యేమిటంటే మేము బైటకు రాగానే యీ పరిస్థితిని అంతా మారుస్తాము, అధికారములోకి రాగానే వీటిని బాగు చేస్తాము అన్నారు గాని ఇంతవరకు జైళ్ళను బాగుచేయలేదు 1927 నుంచి 1931 వరకు కాంగ్రెసువారు అధికారములో ఉన్నారు 1910 నుంచి 1955 ఆఖరు వరకు మరల 10 సంవత్సరములు అధికారములో ఉన్నారు కాని జైళ్ళ పరిస్థితి మాత్రము మారలేదు

The Hon Sri A B NAGESWARA RAO — మనము జైళ్ళలో ఉన్నప్పుడు 0-2-9 ఉంటే, ఇప్పుడు 3-0-0 డిటెన్యూగా ఉంటే పుచ్చుకుంటున్నారు కనుక అప్పటికి ఇప్పటికి మార్పు ఉంది

Sri P SUNDARAYYA — నేను డిటెన్యూల సంగతి మాట్లాడడములేదు మనము డిటెన్యూలుగా ఉన్నప్పుడు 3% తీసుకొంటూ వున్నామన్న సంగతి జైళ్ళమంత్రి గారు పెట్టుకోవాలి ఉంది ఆ రోజులలో Detenues 37, 38 మంది State Regulation క్రింద వుండేవారు నేను మామూలు వారి సంగతి చెబుతున్నాను

తరువాత 32 రోజులు ఈ బడ్జెటుమీద సమావేశము, చర్చ జరిగింది రేపు ప్రజలదగ్గరకు వెళ్ళేచున్నాము ఇన్నాళ్ళనుంచి దూరముగా కర్నూలులో కూర్చొని Assembly లో సంప్రదించుకుంటూ 32 రోజుల చర్చ జరిపాము ప్రజలు మీరు ఏమిచేశారు, మీరు చేసిన ఘన కార్యము ఏమిటి అని అడిగితే చెప్పవలసిన సమాధానము ఏమిటి అని నేను ఆలోచిస్తే, వారు కన్పడిందల్లా కర్నూలు వెళ్ళాము, గంటల కొలది మాట్లాడాము రోజుల కొలది మాట్లాడినాము, మంత్రులు విన్నారు, ఆలోచిస్తూ ఉన్నాము, ఆలోచిస్తాము, అంతా కలసి ఆలోచిద్దాము అని సమాధాన మిచ్చారు అందుకని మీరు ఆశతోనో, నిరాశతోనో ఎదురుచూస్తూ ఉండాలి, అంతకన్నా మేము చేయగల్గింది ఏమిలేదు అని చెప్పడం తప్ప మరేమీ కన్పించలేదు అందుచేత ఈ appropriation bill కు మేము వ్యతిరేకంగా ఓటు చేయక తప్పదు

The Hon Sri B GOPALA REDDI — అధ్యక్షా! గడచిన నెల 8 వ తేదీనుంచి ఈ బడ్జెటు సమావేశము జరుగుతూవచ్చింది విభిన్న జిల్లాలనుండి విభిన్న సభ్యులు తమతమ అభిప్రాయములను వారి జిల్లాలలో తాలూకాలలో ఉన్న అనేక విషయాలు ప్రభుత్వానికి చెప్పడానికి ఈ బడ్జెటు సమావేశము ఒక అవకాశ

ముగా ఉన్నది. ఈ దినము Appropriation Bill ఇస్తున్నాము అంటే ప్రజాప్రతినిధుల నుండి ప్రభుత్వమువారు 114 కోట్లు కోరుతున్నారు. దానిని యిచ్చేది, ఎలాగా యిస్తున్నారు, ఏదో అక్షింతలువేసి ఆశీర్వచనముతో ఇస్తారని అనుకున్నాను. కాని ఇన్నాళ్ళనుంచి చేసిన విమర్శ ఈ రోజు కూడా సూక్ష్మముగా చేయడము కాకుండా యీ Appropriation Bill కు వ్యతిరేకముగా వోటు చేస్తామని ప్రతిపక్ష నాయకులు చెప్పుచున్నారు.

ఈ Appropriation Bill వ్యతిరేకంగా vote చేసి ఒకవేళ వారే నెగ్గితే ఏమౌతుందో వారు తెలియదు. వళ్ళీ ఎలక్షను జరుపుకోవలసివస్తుంది. అందువల్ల మన అందరియొక్క క్షేమంకోసమైనా యీ Appropriation Bill ఏకగ్రీవంగా pass చేస్తే మంచిదేమో నని అనుకుంటున్నాను. సుందరయ్యగారు యీనాడు కూడా కొంత అలంకారప్రాయంగా మాట్లాడినారు. అది మన సుబ్బారావుగారు చెబుతున్నారు, స్తుతి నిందో, నిందా స్తుతో తెలియదుగాని అనేకవిషయాలు కొంతగంభీరంగా మాట్లాడినారు. ఎప్పుడు ఆయన చెప్పిన 15 20 నిముషాల speech లో 15, 20 విషయాలను గురించి మాట్లాడినారు అంటే సూక్ష్మముగా, టూకీగా ఒక్కొక్క sentence విషప్పటికీ కూడా అనేక విషయాలు మాట్లాడినారు. వారు మాట్లాడుతూ వుంటే హోమియోపతీ medicine జ్ఞాపకంవచ్చింది. అంతా కూడా సూక్ష్మంగా, చిన్నచిన్న doses వేసుకొంటే ఈ గవర్నమెంటు జబ్బు ఏమన్నా కుదురుతుందేమో అనేటటువంటి మాటగ చెప్పినారు. తరువాత మన దూర్వాసుల సుబ్బారావుగారు ప్రారంభించినారు యీ చర్చను, సుందరయ్యగారు యీ చర్చయొక్క కపటపట మాట్లాడినారు. దూర్వాసుల సుబ్బారావు కూడా కొంచెము కవిత్వంగానే మాట్లాడినారు. ఏదో మేమంతా శంకుస్థాపననే చూస్తాం, పునాదిరాళ్ళనే చూస్తాం అనుకుంటే మాకు ఎక్కడ పట్టినా కూడా సమాధిరాళ్ళే కనబడుతున్నాయని అన్నారు. ఎవరి దృష్టి ప్రకారంగా వాళ్ళకు కనబడుతూ వుంటుంది. ఏది ఆపేక్షిస్తే అదే కనబడుతూ వుంటుంది. సుబ్బారావుగారికి దేశం అంతా కూడా, యీ పంచవర్ష ప్రణాళికలో ఎక్కడపడితే అక్కడ సమాధిరాళ్ళు కనబడుతున్నాయి. యీ ప్రాచీన వైభవంయొక్క సమాధులంతా, గోరీలంతా, యీ ఖబరిస్థానంతా కనబడుతుందని వారు చెబుతున్నారు. మరికొంతటి వాళ్ళ వాళ్ళ దృష్ట్యా ఏదో పెద్ద భవిష్యత్తు రాబోతున్నది, దానికి కావలసినంత పునాదులు వేయబోతున్నారు. నందికొండకు — ఇక ముందు దయచేసి పత్రికలవాళ్ళు మన మెంబర్లను కూడా నందికొండ ప్రాజెక్టు అనేటటువంటి విషయంగా అనకుండా నాగార్జునసాగర్ అని మనం అనవలసియున్నది. దానికి Government of India కూడా అంగీకరించారు. హైదరాబాదు ప్రభుత్వం వారు ఆమోదించారు. నందికొండ అనే మాట కాకుండా నాగార్జునసాగర్ అనేటటువంటి పేరుతోనే మనం పిలుస్తాం. దానికి యీ మాదిరిగా పెద్ద పెద్ద విషయాలు జరుగబోతున్నాయి. పెద్ద మహత్తరమైన విషయాలు సాధించుమని, దరిద్రం మీద విజయం సాధించబోతున్నాం అని కొందరూ అనుకునేవాళ్ళకు పునాదిరాళ్ళు, శంకుస్థాపనలే వాళ్ళకు కనబడుతున్నాయి. కాబట్టి ఇది ఎవరిదృష్టిలో వాళ్ళకు ఆవిధంగా వుంటుంది. అప్పుడు మహాత్మ గాంధీ English lady గురించి అన్నారు Drainage Inspector report మాదిరిగా. Drainage Inspector కు ఏమి కనబడుతుంది? ఎక్కడ చూచినా మురికి కాలువలే కనబడుతవి గాని, రహదార్లు గాని, భవనాలుగాని కనపడవు,

ఆకాలువల్లో ఏమున్నాయి, ఏమి దుర్గంధాలున్నాయి, ఏమి పురుగులున్నాయి, అట్టి ఆయన రిపోర్టులో యింకొకటి వుండదు ఈ మాదిరిగా ఒకరొకరియొక్క దృష్టి ఆవిధంగా వుంటుంది రోజులు మారాయి అని ఆయన చెప్పినాడు రోజులు మారాయిగాని బుద్ధులు మారలేదనిపిస్తుంది, సంకల్పాలు మారలేదనిపిస్తుంది మన భవిష్యత్తుకు తగినంత నిర్మాణం మనం చేసుకుంటున్నాం ఈనాడు జరిగేటటువంటి విషయం, ఈ సంవత్సరం జరిగేటటువంటి విషయం రెండవ పంచవర్ష ప్రణాళికకు ఒక సింహద్వారంమాదిరిగా ఈ సంవత్సరము మేము చేస్తాము, ఈ సింహద్వారంద్వారా నడచిపోవలసివున్నది రేపు వచ్చేటటువంటిది ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అందువల్ల యీనాడు దానికి ఉపోద్ఘాతంగా ఉన్నది ఈనాడు ఎక్కువ irrigation మీద electricity మీద, చదువు వగైరాలమీద అన్నిటికీ డబ్బు 6 కోట్లు రూపాయలు ప్రభుత్వమువారు కోరవలసివచ్చింది దాని సంబంధించినవరకు consolidated fund లోనుంచి 64 కోట్ల రూపాయలు sanction చేయండి ఖజానా Department కు యింతఅని 12 దినములనుంచి 12 demand లు pass చేసినారు ½ దినములు దానికి ఒక ఆలోచన చేసినారు ఈనాడు ఒక మంగళవాచకంగా మీరు దీనికయినా ఒక అనుమతి చేయండి అని కోరినాను కాని దీనికికూడా కొంత అభ్యంతరంచెప్పి ప్రభుత్వంవారు ఏవిషయంమునకూడా అంతా ఆలోచిస్తున్నాం, అందరూ కలసి ఆలోచిస్తున్నాం, ఆలోచించినా, యింకా ఏమీ పని చేయలేకుండావున్నాం అని చెబుతారుగాని ఏపనీకూడా సాగించడం లేదనే మాటగా చెబుతున్నారు కాని మన దేశంలో వున్నటువంటి వైపరీత్యమైన పరిస్థితులనుబట్టి యేమి చేసినప్పటికీ, చేసినట్టుగా కనపడటం లేదు అంత అధః పాతాళ లోకంలో వున్నాం మనం అంత అనారోగ్యంలో, అంత అవిద్యలో వున్నాం మనం నిజమే, ఏమి చేసినాసరే, యుద్ధం అయిపోయి యింకా 10 సంవత్సరాలు కాలేదు బహుశ యీ ఆగస్టు 15 కు స్వరాజ్యం వచ్చి యింకా 8 సంవత్సరాలు కాలేదు అటువంటి పరిస్థితులలో ఎంతవరకు, ఏమిజరిగింది - ఈ 8 సంవత్సరాలలో ఏమయినా జరిగిందా లేదా దేశములో ప్రజానీకానికి ఒక ఏమయిన ఉత్సాహం కలిగిందా లేదా అనేటటువంటి విషయం ఆలోచిస్తూంటే ఎక్కడా కనబడ్డంలేదు, అంతా నిరుత్సాహమే అంతా నైరాశ్యమే అని చెప్పడంకూడా న్యాయంకాదు మన ప్రజలకే అది ఒక నింద అని నా వుద్దేశం మా ప్రజలు యీ 8 సంవత్సరాలలో కొన్ని కొన్ని విషయాలు సాధించారు కొన్నికొన్ని విషయాలలో ముందుకుపోయినారు అవన్నీ గుర్తించి మీరుచేసినటువంటి పని శభాష్ బాగుంది యింకా ముందుకుపోవలసి వున్నది అని హెచ్చరించడం మంచిది కాని, మీరు చేసినదంతా ప్రయోజనంలేదు మీరు యింకా దరిద్రంలో క్రుంగిపోతున్నారు, ఇంకా అవిద్య ఎక్కువ అయిపోతున్నది, అని ఒక రకమైనటువంటి నైరాశ్య వాతావరణం కల్పించి వాళ్ళకు మనం చేసేటటువంటి ఉపకారంకూడా లేదేమో అని కూడ అనిపిస్తున్నది అందువల్ల జరిగిందేమో యీనాడు జరుగుతున్నది పెద్దవిషయాలు జరుగుతున్నాయి, పెద్దపెద్ద విషయాలకు మనం శంకుస్థాపనలు చేసుకుంటున్నాం. మన ప్రధానమంత్రి యితరదేశములకు పోయి శాంతిస్థాపన కోసము కృషిచేస్తున్నారు ఈ ప్రయత్నాలంతాకూడా హిందూదేశానికి వస్తున్న గౌరవమేకాని ఒకవ్యక్తికి ఒక స్థానానికి వచ్చిన గౌరవంకాదు ఈనాడు వారు మాట్లాడుతున్నప్పుడు హిందూదేశం సందేశం క్రింద వారు తీసుకుంటూవున్నారు. ఈ విషయంలో

అంతాకూడా మనం నిర్వించవలసిన విషయాలన్నీ మరచిపోయి కేవలం ఏదో జరగలేదు, మేము చెప్పింది కాలేదు, ఈ మంత్రులంతా కూడా ప్రజలను మరచిపోయినారు, అని ఒక్కసారిగా వాళ్ళకు ప్రజలకు ఒకదూరం కలుగజేయడం కూడా న్యాయం కాదేమో నని కూడా అనిపిస్తున్నది అందువల్ల యిది ఒకవేళ ఆవేశ పడవలసిన విషయం కాకపోయినా కూడా రెండు విధములు పంచవర్ష ప్రణాళిక గురించి చెప్పినారు చాల విషయాలు బడ్జెటులో చెప్పినట్టు చెప్పినారు కాని యీ విషయంలో కూడా సరైనటువంటి financial resources సంగతి ఆర్థిక పరిస్థితుల గురించి సరైనటువంటి మాదిరిగా చర్చ పూర్తిగా జరగలేదని భయంగావున్నది లేనిపోని ఆశలు కలుగజేసి యిది మేము సాధించబోతున్నాం అని, irrigation, electricity, విద్య, ఆరోగ్యం అని చెప్పి రేపు ప్రొద్దున్న వాళ్ళు మీ రున్నటువంటి ఆర్థికపరిస్థితి యేమి, ఎంతవరకు మీ లోటును తీర్చుకున్నారు, 5 సంవత్సరాల తరువాత వచ్చే Institutions మీదవచ్చే recurring expenditure ఏమాదిరిగా తీసుకుపోతున్నారు, అని రేపు ప్రొద్దున Planning Commission, గాని, ఆర్థిక మంత్రిగాని అడిగినప్పుడు ఏమిసమాధానము చెప్పాలో నామట్టుకు నాకు తెలియకుండా వున్నది అది కేవలం ఎవరి దగ్గరనో దేశముఖ్ గారి దగ్గరనో ప్లానింగు కమీషను దగ్గరనో ఏవో కొన్ని కోట్ల రూపాయలు కొలగులలో వున్నాయని వటిలోనుంచి యింకా మనవాళ్ళు యింకాగట్టిగా అడగలేదే మరి 500 కోట్లు ఎందుకు అడగలేదు, మద్రాసులో 400 కోట్లు అడిగారు బొంబాయిలో 600 కోట్లు అడిగారు, మీరు యింకా 230 కోట్లలోనే ఎందుకున్నారు? మీరు కూడా 5,6 వందలకోట్లు ఎందుకు అడగ కూడదు, అని ఆదృష్టిగా గవర్నమెంటు మీద ఒత్తిడి కలుగ చేసినారు గాని యిదంతా కూడా ఎవరో ఏదో మనకు దానం చేయబోయేది లేదు దేశముఖ్ కాని ప్లానింగు కమీషనుగాని మనకు దానం చేసేటటువంటి విషయము కాదిది మన యొక్క స్థితినిబట్టి మనయొక్క ఆర్థిక స్తోమతునుబట్టి ఆ కేక పరిస్థితులను బట్టి మనం సాగించుకోవలసి యున్నది మన భవిష్యత్తు మనం నిర్మించుకోవలసి యున్నది అది కొన్నిట్లో statutory గా యేమి యివ్వాలో అది మాత్రమే గవర్నమెంటువారు యిస్తున్నారు చిన్న చిన్న tractors వడ్డీలేని అప్పు కావాలంటే యిస్తారు నందికొండ, మాచ్ ఖండ్ వగైరాలకు అప్పు కావాలంటేయిస్తారు అంతేకాని మొత్తముమీద మన స్కూలులు, యూనివర్శిటీ, రోడ్లు, హరిజన వెల్ఫేరు, వీటన్నిటికీ మనయొక్క స్తోమత, ఆర్థిక ఆదాయాన్నిబట్టి కూడా సాధించుకోవలసినదే కేవలం Government of India మీద ఆధారపడడానికి వీలులేదు వాళ్ళ దగ్గర కూడా అపారమైన ద్రవ్యములేదు మనతోపాటు కూడా 28 రాష్ట్రాలున్నాయి A class B class, C class states, యింకా వెనుక బడినటువంటి ప్రాంతాలు వరద ప్రాంతాలు, క్షామప్రాంతాలు అనేకం వున్నాయి అటువంటప్పుడు ఆ పరిస్థితులలో కేవలం మేముమాత్రం వున్నాం, మాకుమాత్రమే grants యివ్వాలి, subsidyయివ్వాలి అని చెప్పడానికి కూడా వీలులేదు Equality of treatment ఉండవలసినదే కాని మనకుమాత్రమే ఎక్కువ చేయడానికి అక్కడ ప్లానింగు కమీషను వారు కోరు అటువంటి పరిస్థితులలో రేపు ఏమి కాబోతున్నది? ఈ దినం కాదు రేపే మన Financial Secretary, Planning Secretary ఢిల్లీకు పోతున్నారు 6 వ తేదీన discussion జరుగుతుంది రేపు ఆయన వచ్చిన తరువాత ఏమి జరిగిందో వాళ్లు యేమి ప్రశ్న వేసినారో కొంతవరకు మాకు తెలుస్తుంది తరువాత

మేము వచ్చే ఆగస్టు 31 తేదీ, సెప్టెంబరు ఒకటో తేదీని ప్లానింగ్ కమిషను దగ్గరకు పోతున్నాం. అక్కడ వారు అడిగేది ఎన్ని కోట్లు irrigation కు పెట్టారు, ఎన్ని కోట్లు electricity కి పెట్టినారు అనేటటువంటి విషయం కాదు What are you doing about your financial resources? అనే ప్రశ్నే వారు పదేపదే అడుగుతున్నారు. ఆ ప్రశ్నకే సమాధానం చెప్పవలసివున్నది. అటువంటప్పుడు ఈ 200 కోట్లు, 240 కోట్లు ఎంతవరకు నిలుస్తుందో మనకే తెలియకుండా వున్నది. మనకు recurring deficit వున్నది అనేటటువంటి విషయం వాళ్ళకు తెలుసు, మనకు తెలుసు. Reserve Bank కు తెలుసును. ఎందుకనంటే ప్రతిదినం over draft యివ్వవలసివున్నది. కాబట్టి అటువంటి పరిస్థితులలో యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు కొంతవరకు చేయవలసిన త్యాగం మనం చేయలేకుండా పోతున్నామేమో. మనం ఏదో మనమీద పడవలసిన భారాన్ని మనం తప్పించుకుపోతున్నామేమో అనేటటువంటిదికూడా ఒకోసారి భయం అవుతూవుంటుంది. మనం యేమయినప్పటికీ కష్టం అయినప్పటికీకూడా మనం శ్రమపడదాం, మనం ఒకవేళ కష్టపడ్డప్పటికీకూడా మనబిడ్డలైనా మనుమలైనా సుఖపడనీ, దేశంలో దరిద్రం లేకుండా పోనీ అనే వుద్దేశంతో మన ప్రజలు కొంత వరకు త్యాగాలు చేయడానికి పూనుకున్నప్పుడు మనసంతతివారు, భావిసంతతివారు బాగుపడతారే కాని, ఏదో పడిపోతున్నది మా నెత్తిన మాకు యిప్పటికే దరిద్రంలోవున్నది యింకా దరిద్రంలో ముంచేయబోతున్నారు, మీ పన్నులభారంవల్ల, అనే తత్వంతో మనం పూనుకున్నట్లయితే ఒకరకంగా మన భవిష్యత్తుకు మనసంతతివారికి మనం అపచారం చేసినవారమవుతామేమో అనికూడా నాకు అనిపిస్తున్నది.

ఇంతకుముందు మన పెద్దలు కష్టపడ్డారు. మనకు స్వరాజ్యము వచ్చింది. మన కాలములో మనము కొంతవరకు కష్టపడి మన సంతతివారికైనా దారిద్ర్యములేని ఒక భారతదేశాన్ని యిచ్చి పోతే వాండ్లు సుఖపడుతారు. మనకేదో స్వార్థముగనో సంకుచితముగానో ఏదో ఒక రకముగా ఇప్పుడు పడబోయే పన్నులభారాన్ని తప్పించుకొన జూచినట్లయితే మన దేశానికి కష్టమౌతుందేమో, మన మనుకున్నంత త్వరితముగా యీ దారిద్ర్యాన్ని తీసివేయలేక పోతామేమో. 10, 15 సంవత్సరాలలో తీర్చవలసినది ఏ 30, 40 సంవత్సరాలలోనూ తీర్చగలమేమో అని కూడా అనిపిస్తుంది. ఏవిధముగా వినప్పటికీ కొంతవరకు కాయకష్టము చేయవలసి వస్తుంది. ధనసహాయము కావలసి యున్నది. ఇవన్ని కూడా మనము సాధించుకొని, సేకరించుకొనినప్పుడే మన దేశానికి మోక్షము కాని కేవలము వట్టి మాటలతో కాని లేకుంటే కేవలము విమర్శలతోను, సమీక్షలతోను లేకుంటే ప్రశ్నోత్తరములతోను జరిగే విషయముకాదు. దేశమంతా కూడా యీనాడు 36 కోట్లమంది ఒకరకమైనటువంటి దీక్షతోను సంకల్పముతోను మా దేశ అభ్యుదయముకోసము మేము పనిచేయబోతున్నాము. దానికి కావలసిన ధనాన్ని మేము సేకరించుకుంటున్నాము — అప్పుల మూలకముగనో, పన్నుల మూలకముగనో అనే దృక్పథము మనకు వచ్చినపుడు జరుగుతుందే కాని, ఎవరో మహారాజులున్నారు వాండ్లు మాత్రమే యివ్వాలి మేము మహారాజులముకాదు మామీద ఏమీ పడకూడదు భూమిమీద పడకూడదు ఇంకా కేనిమీద పడరాదనే దృష్ట్యా చూచినపుడు మన దేశానికి వచ్చేటటువంటి అభ్యుదయాన్ని కొంతవరకూ వెనకకు నెట్టుతున్నామేమోనని అనిపిస్తుంది. అందువల్ల మనము కొంతవరకైనా త్యాగంగా చూడవలసిన అవసరమున్నది. ఎందుకంటే పంచవర్ష ప్రణాళిక విషయము అనేది 1956 April నుండి మనకు ఒక

పెద్ద venture చేయబోతున్నాము ఆరువేల చిల్లర కోట్లు మనదేశములో ఖర్చుపెట్టి నూతన విషయాలను మనము సాధించుకోబోతున్నాము దానికి కావలసినటువంటి ధనాన్ని సేకరించవలసిన బాధ్యత ఇంతవరకు మీమీద మాత్రమే లేదు మన అందరిమీద కూడ వున్నది ఎవరో ఎక్కడోనో కూర్చున్నారు వాండ్లదే ఆ బాధ్యత, డబ్బు బాధ్యత మనదికాదు కేవలము రోడ్లు కావాలి, schools కావాలి లేకుంటే water supply కావాలి అని చెప్పేది మాత్రమే మావంతు అని అనుకోవడము చాల పొరపాటైనటువంటి విషయము మనదేశాన్ని సమగ్రమైనటువంటి విశాలమైనటువంటి దృష్టితో చూచి దానికి కావలసిన స్తోమతుఅంతా కలుగజేసి దానికి తగినటువంటి వాతావరణము కల్పించుకొని మనమంతా పనిచేసినప్పుడు సాధ్యపడుతుంది కాని ఎవరో ఏదో యిస్తారు అడిగేవరకు మాత్రమే మనది అంటే మాత్రము ప్రయోజనములేదు నేను చెప్పినట్లు పంచవర్ష ప్రణాళికకు నాందిగా యీ సంవత్సరమంతాకూడా కొన్ని పనులు జరుగుతున్నాయి ఇది వినతర్వాతనే 56 April నుంచి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రాబోతున్నది దీనికి తగినటువంటి వాతావరణము మనము కలుగజేసుకోవాలి యీ Community Projects National Extension Schemes వీటన్నిటి ఉద్దేశముకూడా ప్రజలయొక్క సహకారము కావాలని, మీరు కూడా కొంత contribution యివ్వాలనే కేవలము గవర్నమెంటుమీదనే ఆధారపడకుండా మీరు నాల్గవవంతు యివ్వండి మేము సగము యిస్తాము అనేమాదిరిగా ప్రజలందరినీ ఆహ్వానిస్తున్నాయి ఈ National Extension schemes, యీ local Development schemesకొన్ని కొన్ని ప్రాంతాలలో మేము యివ్వలేకుండా పోతున్నామంటున్నారు ఆ విషయములో ఏదైనా కష్టముంటే సానుభూతి పూర్వకముగా ఆలోచించవలసియున్నది కాని మూలసూత్రము మాత్రము ప్రజలయొక్క సహకారము రావాలి కేవలము మీరు చేయండి మేము అడుగుతాము అడిగేటటువంటి వంతేమాది, చేయవలసినటువంటి బాధ్యత మీది అనేటటువంటి మాటకాకుండా మాకు రోడ్డు కావాలి ఇదిగో మేము యిస్తున్నామిది, మాకు కాల్వ కావాలి, మా contribution ఇది, మాకు బావి కావాలి, ఇదిగో మా contribution ప్రజలందరూ వచ్చి వాండ్లే సాధించినారనేటటువంటి తన్మయత్వము వాండ్లకు వచ్చినప్పుడు వాండ్లకు సంతోషముగా వుంటుంది కాని మేము అడిగాము ఏదో తహసీల్దార్ చేసిపోయినాడు, ఇది అప్పుడే పడిపోయినది, అది అప్పుడే మరమ్మతు కావలసియున్నది అనే మాదిరిగా చెప్పితే అది న్యాయముగా ఉంటుందేమో అని కూడ అనుకుంటాను మనయొక్క మూలసూత్రంగా ప్రజలుకూడా కొంతవరకు contribution యివ్వాలి అది కాస్తో కూస్తో 25% లేకుంటే 12½% ఏదైనప్పటికీ కానివ్వండి అందరియొక్క పని మా గ్రామము యొక్క పని మాతాలూకా యొక్క పని అనే మాదిరిగా యీ కాము ప్రజలందరిని ఇవన్నీ ఆహ్వానిస్తాయి ఇక expenditure విషయములో మనము 64 కోట్ల రూపాయలు యిస్తున్నాము ఇది సరియైన మార్గములో ఖర్చు అవుతున్నదో లేదో మాకేమి control లేకుండా పోతున్నది. మా Accounts Committee ఎప్పుడో రెండేండ్లకు మూడేండ్లకు సమీక్ష చేస్తుంటే కాని యీ నాడు జరిగే ఖర్చంతాకూడా వాండ్ల control లో వుండదు, కాబట్టి మీరు Estimate Committee పెట్టితే బాగుంటుందనే విషయము T N వెంకట సుబ్బారెడ్డిగారు చెప్పినారు, సుందరయ్యగారు కూడా చెప్పినారు. ఇంకా కొంతమంది మిత్రులుకూడా చెప్పినారు. ఎవరుకూడా ఏ ప్రభుత్వమైనా కూడా దుర్వినియోగము కావాలని కోరరు.

మనకు అతి కష్టముమీద సంపాదిస్తున్న ద్రవ్యాన్ని దీనికి ఖర్చులకు కూడా మనము Reserve Bank దగ్గరనుండి overdraft తీసుకొని తెచ్చుకుంటున్నాము భరించలేని వారిమీద కూడా ఒక్కొక్కసారి పన్నులు వేస్తున్నాము అటువంటి పరిస్థితులలో ప్రభుత్వము కూడా సద్వినియోగము కావాలని కోరడు వాళ్లు పెట్టేటటువంటి ఖర్చు elementary schools మీద కావచ్చును Aided schools మీద కావచ్చును లేకుంటే hostels మీద కావచ్చును లేకుంటే canals మీద కావచ్చును Electricity మీద కావచ్చును ఏదైనప్పటికి కూడా సక్రమమైన ప్రతి ఫలము రావాలనేటటువంటి ఉద్దేశముతోనే ప్రభుత్వము ఆశిస్తున్నది కాని ప్రభుత్వములో వున్నటువంటి వ్యవస్థను బట్టిగాని సమాజములో వున్నటువంటి దౌర్బల్యాన్ని బట్టిగాని లేకుంటే సాంప్రదాయాన్ని మామూలునుబట్టి గాని ఏదైనప్పటికిన్ని కూడా అక్కడక్కడా కొంత దుబారా జరుగుతున్నదనే విషయము అప్పుడప్పుడు ప్రజలు చెప్పడము మాకు తెలిసినంతవరకూ మా నోటీసుకు కూడా రావడము జరుగుతున్నది ఒకవేళ Estimate Committee వారు ఆ దుబారాలో ఒకవేళ 10 వ వంతో లేక 20 వ వంతో నివారింపగలిగినప్పటికి కూడా Estimate Committee పెట్టడానికి మాకేమి ఆక్షేపణలేదు అదే సభ్యులందరి కోరిక గనుక ఐతే దానివల్ల కొంత దుబారా తగ్గుతుందని లేకుంటే డిపార్టుమెంటులో ఏ మాదిరిగా indents చేస్తున్నారో ఏ contracts పిలుస్తుంటారో యీ ఖర్చు ఎంత పెట్టుతున్నారో అని చూడడానికి అవసరముగా వుంటుంది ఇది Government of India లో కూడా వున్నది ఇటీవల మద్రాసు గవర్నమెంటువారు పెట్టినారు ఇక్కడ కూడా మీరు పెట్టాలని మెంబర్సు చెప్పితే నా మట్టుకు నాకు ఏ మాత్రము ఆక్షేపణలేదు ఎవరైనా సరే Opposition members కూడా దానికి Chairman గా వుండవచ్చును లేకపోతే Govt పక్షమువారైనా వుండవచ్చును ఎవరైనప్పటికికూడా అటువంటి Estimates కమిటీ పెట్టడానికి నాకు సమ్మతమే మొన్న నేను మద్రాసుకు పోయినాను Dr U Krishna Rao గారు దానికి *Chairman* గా వున్నారు వారితోను అక్కడి Finance Department తో కూడా కొంతవరకు చర్చలు నేను జరిపాను దానిని వారు ఇప్పుడిప్పుడే ప్రారంభము చేసినారు వాండ్లకుకూడా సరియైన అనుభవము లేదు బహుశా Govt of India లో కొంతకాలముగా వున్నది మద్రాసులో కొంత అనుభవము వచ్చినతరువాత ఆ అనుభవాన్నిబట్టి మనము estimates Committee పెట్టుతామేమో అని అనుకున్నాము కాని ఇప్పుడు మెంబర్సుయొక్క ఉద్దేశాలనుబట్టి చూస్తే ఎవరో కొంతమంది అనుభవముగలవారు 10, 15 మంది అక్కడవుండి ప్రతి డిపార్టుమెంటులో ఏమి జరుగుతున్నది వాండ్లు ఎటుల ఖర్చుపెట్టుతున్నారో hospitals లో మందులకు bed sheets మొదలుకొని వాండ్లు పెట్టే ప్రతి ఖర్చు కూడా పరిశీలన చేయడానికి అధికారము వుంటుంది Estimates Committee కి లేకుంటే P W లోనో Electricity లోనో లేకుంటే హరిజన Hostels లోనో లేకుంటే Elementary Education లోనో మనము పెట్టే ఖర్చంతా సరిగా జరుగుతుందా లేదా అని పరిశీలనచేయడానికి హక్కుఉంది రేపు Rules కమిటీ Vizag లో meet చేసినపుడు ఆ Rules లోనే పెట్టడానికికూడా నాకేమి ఆక్షేపణలేదు యీ 15 మందిని ఎన్నుకొమనో లేకుంటే proportional representation గా ఎన్నుకొమనో

లేకుంటే అన్ని పార్టీలవారు వుండేటట్టుగా చేసుకోమని Estimates Committee పెట్టితే నా కేలాంటి అభ్యంతరము లేదు దానివిషయము లోనికి నేనేమి వెనుకకు పోవడములేదు ఈ విషయంలో అనుమానమైనా కొంత తగ్గితే నేను సంతోషిస్తాను ఎందుకంటే ఇది ప్రజలయొక్క ద్రవ్యము వారు కష్టపడి సంపాదించినదానిలో వారు నమ్మడి నమ్మడిగా యిచ్చినటువంటి ద్రవ్యము మనము తీసుకొంటున్నాము అది అంతా కూడా దుర్వినియోగమైపోయింది, మీ Elementary Education అంతా waste, యీ wells అంతాకూడా waste అని ఒకరూ, మీరు యిచ్చిన Agriculture ఖర్చంతా కూడా waste అని ఇంకొకరు అనడము యీ మాదిరి కాకుండా కొంతమంది మెంబర్సు ఎప్పటికప్పుడు చూడడానికి ఒక Estimates Committee పెట్టడానికి ప్రభుత్వము వారికి కూడా సమ్మతముగనే వున్నది ఆ విషయములో తర్వాత చర్చచేసుకోవచ్చును కాని దీనితోపాటు ఆ కమిటీకే మన financial resources కూడా సమీక్షచేయడానికి వున్నటువంటి deficit ఏమిటో ఎక్కడ ఖర్చు తగ్గించాలో లేకుంటే Taxation ఎక్కువ చేసుకోవాలో ఎక్కడ కమిచేయడానికి వీలుంటుంది అని యీ financial resources కూడా సమీక్షచేయడానికి ఒక అధికారము ఆ కమిటీకి యిస్తే మంచిదేమోనని అనుకుంటాను

Sri P SUNDARAYYA — ఆ కమిటీకే కాదు Standing Finance Committees అని ఇదేరకముగా ప్రతి Departments Committee లకు కూడా యివ్వవలసివుంటుంది Financeకు సంబంధించినంతవరకు Standing Finance Committee కి యిస్తే బాగుంటుంది

The Hon Sri B GOPALA REDDI — ఇది బహుశా ఢిల్లీలో కొన్ని కోట్లకూ సాధులుగా ఒక department ఖర్చుపెట్టుతారు Railways మీద defence మీద లేకుంటే అనేక రకాలుగా కొన్ని వందలకోట్లు ఖర్చుపెట్టుతారు కాబట్టి ఒక Estimates committee కేవలము ఖర్చుమాత్రము తగ్గించడానికి, ఖర్చును చూడడానికి ఒక కమిటీ, తర్వాత finance అనిచెప్పి దానికి కావలసినదంతా చూచుకోడానికి ఒక కమిటీఅని చెప్ప అక్కడ ఆమాదిరిగా వుంటే వుండవచ్చును కాని ఇక్కడ మనకు సంబంధించినంతవరకూ రెండు కమిటీలు అనవసరమేమో అనిపిస్తుంది దుబారా తగ్గించడానికి ఏదైనా ఆదాయము ఎక్కువచేయడానికి రెండుకూడా అదే కమిటీ చూచుకుంటే ఒక సమగ్రమైన దృష్టితో వాండ్లు పరిశీలనచేయగలరేమో అనిపిస్తుంది ఆమాదిరిగా వాండ్ల powers కొంచెము enlarge చేసి యీ విషయాలన్నీ కూడా చూడడానికి వాండ్లకు అధికారమిస్తూ ఒక Estimates Committee and Financial Resources Committee అని చెప్పి వాండ్లమీదనే ఆ బాధ్యత పెట్టితేకూడా బాగుంటుందేమో అనికూడా నా ఉద్దేశము

Budget general discussion లో వచ్చినటువంటి విషయాలు తిరిగి చాలా వచ్చినాయి Budget demands discussion లో వచ్చినటువంటి విషయాలు, ప్రభుత్వంవారు మరచిపోయినారేమో మళ్ళీ ఒకసారి జ్ఞాపకం చేద్దామని అనుకొని కొందరు మళ్ళీ చెప్పియుండవచ్చును ఇవన్నీ క్రమేణా మనం పరిశీలన చేసుకోవలసి యున్నది మన సుందరయ్యగారు ఒక విషయం చెప్పినారు చెప్పినవన్నీ కూడా

notes తీసుకొని department ల వారు వాటిమీద ఏమి చర్య తీసుకున్నారో మాకు ఢిల్లీలో తోడనే తెలుపుతూవచ్చినారు, speeches అవుతూండగానే

Sri P SUNDARAYYA — ఆయాశాఖలకు సంబంధించిన చర్చ జరుగుతూ యున్నప్పుడు notes తీసుకొని వెంటనే, అంటే మరుసటిరోజునే సమాధానం పంపవలెను కోండి, ఏమైనా points raise చేస్తే సాధ్యమైనంత త్వరలో అనగా ఒక నెల రెండు నెలల లోపల సమాధానాలు పంపించేవారు

The Hon Sri B GOPALA REDDI — ఇక్కడ ఆ ప్రకారంగా సమాధానాలు పంపేటటువంటి సాంప్రదాయం లేదు, Madras కు సంబంధించినంత వరకూ ఇక్కడ నాకు తెలియదు Madras లో కూడా ఈ Budget speeches అన్నీ అవుతూండగానే print ఐన తరువాత ఆ departments ఆ speeches చదువుకొని దానిలో పెద్ద points ఉంటే Minister లకు చెప్పి ఆ విషయాలు సవరించుకోవడానికి వచ్చి చూచుకుంటూ ఉండినారు అంటే ఆ speeches print ఐనతరువాత దానికి సంబంధించి ఆయా శాఖలవారు వాళ్ళు ఏమి action తీసుకున్నదీ member లకు తెలిపే సాంప్రదాయం ఎక్కడలేదు ఆదేదైనా పెద్ద విషయం జరిగినప్పుడు చెప్పడానికి వీలవుతుందేమో నాకు తెలియదు

Sri G YELLAMANDA REDDI — సభ్యులు చేసిన విమర్శలన్నింటికీ ఏమేమి చెయ్యబోయేది తరువాత నిదానంగ సభ్యులకు వ్రాతపూర్వకంగా పంపిస్తామని చెప్పి వాగ్దానం చేశారు

The Hon Sri B GOPALA REDDI — దాంట్లో కొంచం ఇబ్బంది ఉంది అంటే పెద్దవిషయం ఏదైనా, చాలా contentions విషయం, పెద్ద scandalous విషయం ఏదైనా చెప్పారనుకోండి, ఏదైనా jeep scandal లాంటిది ఏదైనా చెప్పినారంటే, అప్పుడు విషయం ఇది అనేటువంటి మాటగా మెంబర్లకు వ్రాస్తారు Assembly లో చర్చ జరిగిపోయినప్పటికీ కూడా ఒక D O letter వ్రాసినప్పటికీ కూడా member లకు అటువంటి పెద్దవిషయాలలో సమాధానం తప్పకుండా చెబుతున్నారు ఇప్పుడు ఆ సాంప్రదాయం ఒకటి యున్నది అందువల్ల ప్రతి మెంబరుకీ వారు చెప్పినవిషయాలన్నిటిమీదా ఏమి చర్య తీసుకోబోతున్నారో చెప్పడం కొంత కష్టమౌతుందేమోనని నేను అనుకుంటాను కాని ఏమైనప్పటికీ కూడా దీన్ని తప్పకుండా పరిశీలించి అవి సరిదిద్దటానికి పూనుకోవలసి యుంటుంది ఏలే ఒక్కొక్క సారి జీతాలు ఎక్కువచేయవలసిందనే టటువంటి version ఉందనుకోండి చాలా మంది ఆయ్యో పాపం! వాళ్ళకు ముష్టివచ్చాయిలేనా, మా Chief Secretary కి మూడువేలు జీతమున్నది ఈయనకు 80 రూపాయిలే ఉన్నది అని మాట్లాడి యుంటారు దాన్ని examine చేస్తే ఏంప్రయోజనం స్థానికంగా ఉండే విషయాలు అవి తప్పకుండా చూస్తున్నారు దాంట్లోకూడా అనేకమంది irrigation విషయంలో మాట్లాడుతూ మాకు కాలవరాలేదు రోడ్డు రాలేదు మా ఉదయగిరి తాలూకాలో ఒక్క రోడ్డుకూడా వేయలేదు అనే విషయాలు చెప్పిఉంటే, It is limited to finances కాబట్టి departments వాటినిగురించి ఎక్కువ చెయ్యడానికి వీలుండదు అందువల్ల ప్రతి దానికీ జవాబు రాకపోయినా, ఇవన్నీ department వారు చూస్తున్నారు ఇవన్నీ తప్పకుండా

రికవర్ చేస్తారని నిశ్చయము నేను మీకు చెప్పినాను అందువల్ల దీన్ని గురించి అంతకన్న చెప్పవలసింది ఏమీలేదు ఇక వెంకట్రామానాయుడుగారు ఈ car ల విషయము ఇళ్ళ విషయము చెప్పినారు బహుశః ఆ విషయం వారికి తెలియక ఆ మాదిరిగా అన్నారేమోననిపిస్తోంది క్రొత్తగా ప్రతిసంవత్సరము ఈ car లు కూర్చేది ఏమీలేదు మన సంజీవయ్యగారి car అప్పుడో మద్రాసునుంచి వచ్చిన car Speaker గారి car లేకుండా ఉండింది ఆ car వచ్చింది ఎప్పుడైనా ఒక car ఇక్కడ Guest House లో, లేకపోతే బెజవాడలో ఒక car పెట్టాలనిఉన్నది ఎందుకంటే important people అంతా వస్తుంటారు అందువల్ల car పెట్టాలని ఉద్దేశ్యంతో మూడో car తెప్పించి నాకే గాని Minister లకు వాళ్ళకు కులాసాగా వచ్చినప్పుడల్లా కార్లు మార్చడానికోసంగా ఉద్దేశింపబడినవికావు ఆ విషయములో దుర్వినియోగం లేకుండా చేయడానికి మేము ప్రయత్నము చేస్తున్నామని కూడా వారికి హామీ ఇస్తున్నాను ఇక ఇళ్ళ విషయములో ఇక్కడ కర్నూలులో ఉన్నటువంటి యిబ్బంది మీకు తెలుసు ఆ విషయంలో కూడా కొంత ఖర్చు ఎక్కువగా కనపడ్డప్పటికి కూడా యిక్కడ పెద్ద Hava Mahal లు కట్టుకొని భోగ్యం అనుభవిస్తున్నామనే విషయం ఏమీలేదు ఇళ్ళ విషయంలో ఇప్పుడు ఉన్నటువంటి ఇబ్బందిని బట్టి కొంత వాటిమీద వెచ్చించవలసి వచ్చింది అవి private house లైనా లేక Government House లైనప్పటికీ అంతేకాని అక్కడపైన luxurious గా ఉంచడానికి దుర్వినియోగము ఏమీ జరగలేదు ప్రభుత్వము వారు ఈ విషయములో చాలా జాగ్రత్తగా ఎంతవస్తుంగా, ఎంత మితవ్యయంతో చేయడానికి వీలవుతుందో అంతా చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు ఇంక సుందరయ్యగారు చాలా విషయాలు చెప్పినారు మన Members యొక్క warrants విషయం కూడా చెప్పినారు ఇప్పటికే ఆ విషయము Government of India వారికి పంపించడానికి ప్రభుత్వమువారు కూడా నిశ్చయించుకున్నారు ఈ వ్యవహారమంతా Government of India వారే నిర్ణయిస్తున్నారు కాబట్టి వారికి మనం తెలుప వలసినవారమే గాని మనం ప్రత్యేకంగా చేసేదేమీలేదు అక్కడ కూడా Ministers తరువాతనే M Ps లేరు Ministers కు, M Ps కు మధ్య ఇంకాచాలామంది ఉన్నారు నేను ఈదినం ప్రొద్దున్నే చూచినాను ఈ విషయం ఇక్కడ Legislature Secretariat వారు పంపించిన note లో warrants ఎంతవరకూ ఉన్నవో M Ps ఎక్కడున్నారో M L As ఎక్కడున్నారో, Deputy Speaker ఎక్కడున్నారో, Speaker ఎక్కడున్నారో అనే విషయాలన్నీ వాళ్ళు నిర్ణయించి పంపించింది ఈ విషయంలో M L A లకు atleast M Ps వలెనైనా తీసుకు రావడానికి సిఫార్సు చేయడానికి కూడా మేము పూనుకుంటున్నాం ఇంకా Legislature Secretariat విషయం అది Constitution లోనే వుంది అది ఇప్పుడు వేరేనే యున్నదని నేను భావిస్తున్నాను ఈ విషయమై Madras లో కూడా చర్చ వచ్చినప్పుడు శివషణ్ముగం పిళ్ళెగారు అది వేరేయుండాలని చెప్పినప్పుడు ఆ principle మేము ఒప్పుకున్నాం

Sri P SUNDARAYYA — మన Legislature Secretariat, Secretariat Level లో చూడకుండా Ministerial Staff క్రింద చూచి అన్ని రకాలా ఒక subordinate department క్రింద చూస్తున్నారు అంతేని తప్పితే ప్రత్యేక secretariat staff యొక్క level లో దీనికి ఇవ్వడంలేదు,

5th August 1955]

The Hon Sri B GOPALA REDDI — అటువంటి భావం సుందరయ్యగారికి ఎందుకు వచ్చిందో నాకు తెలియడంలేదు Speaker గారే దీనికంతకూ presiding deity అటువంటప్పుడు వారు చెయ్యాటువంటి complaint సుందరయ్యగారు చేస్తున్నారు

Sri P SUNDARAYYA — ప్రతిపక్ష నాయకుడుగా నేను చేస్తున్నాను

Sri VAVILALA GOPALAKRISHNAYYA — వారు చేయగా కూడా ఎందుచేతనంటే వారు నిస్సహాయంగా యున్నారు పరిస్థితులు దూరంగా కూర్చుంటే అర్థమవుతున్నాయి ఒక ప్రశ్న వేసినప్పుడు కూడా ఈ చిక్కులవుతున్నాయి ఆ Constitutional protection ఉన్నది కనుకనే ఆవిధంగా చేయమని మేమూ అడుగుతున్నాం వారికికూడా లోపలుంది గాని బైటకు చెప్పడంలేదు

Mr SPEAKER — It may not be taken that I am making the request through the opposition members

The Hon Sri B GOPALA REDDI — ఏదైనా ఉంటే చెప్పడానికి మాద్వార మర్మమేమీ వారు పెట్టుకోనవసరంలేదు ఏదైనా ఉంటే చెప్పవచ్చును కాని నాకు తెలిసినంతవరకూ కూడా ఈ Legislature Secretariat Speaker గారి క్రిందనే యున్నదనీ, వారే దీన్ని నిర్వహిస్తున్నారనే ఉద్దేశ్యంతో యున్నాము గాని ఇదేదో ఇంకొక Secretariat కు అంతర్భాగంగా, ఒక annexure గా యున్నదని మేమనుకోవడంలేదు అందుకనే మేము ఆభవనం Court yard లో కూడా లేకుండా వేరేకూడా పెట్టి మీకూ మాకూ క్షోభ్యంలేదు మీరు వేరుగానే యుండండి అని చెప్పాం

Sri VAVILALA GOPALAKRISHNAYYA — Revenue Secretariat తీసుకువెళ్ళి ఇంకో ఇంట్లో పెట్టినంతమాత్రాన అది వేరేగా separate అవుతాయా అంతా ఒకటిగానే యుంటుంది ఇప్పటికీ దానిక్రింద subordinate గానే నడుస్తున్నదని మేము అర్థంచేసుకుంటున్నాం

The Hon Sri B GOPALA REDDI — నాకు అట్లా అర్థంకావడంలేదండి ఎందుకు subordinate గా ఉన్నదని అనుకుంటున్నారో నాకు తెలియడంలేదు నేనింకా చౌదరీగారు దానికి Secretary అనీ మన Speaker గారు దానికి అధినేత అనిన్నీ అనుకుంటున్నాం

Sri P. SUNDARAYYA — Speaker గారున్నారు Speaker గారి క్రిందనే మన సెక్రటరీ, ఉపసెక్రటరీ, ఇక్కడున్న సిబ్బందీ పనిచేస్తున్నంతవరకూ వారికి Independence అంటే అంతవరకేకాదు వారికి కావలసిన డబ్బు, వారికి కావలసిన సిబ్బంది వారికి కావలసిన హోదా, వారికి కావలసిన వసతులూ ఏదైనా కావాలన్నా తక్కిన Secretary లకు జరుగుతున్నట్లు జరుగుతుందా అంటే లేదు ప్రతి చిన్నదానికీ కూడా కొదవ పుస్తకాలు అచ్చువేసుకున్నాకూడా గవర్నమెంటు ప్రెస్ Superintendent గారు order వేస్తేగాని అది అమలులోకి రాని పరిస్థితులున్నాయి అందుచేత ఇది separate అనిగాని independent అనిగాని కాదనుకుంటున్నాం.

